అనువాదకులు :
శ్రీ గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యంగారు,
బి. ఏ., బి. యల్.,

Imprimerie de Sri Aurobindo Ashram, Pondichéry.
W.D. 167/1949—1450,

ప్రకాశకులు :
శ్రీయుత చతుర్వేదుల వేంకటకృష్ణయ్యగారు,
శ్రీ అరవిందాశ్రమం, పుదుచ్చేరి.



వెల : ౧—౦—౦ పోస్టేజి వేఱు.

# వందేమాతరమ్

వందే మాతరం.
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం.

శుభ్ర-జ్యోత్స్న-పులకిత-యామినీం,
ఫుల్ల-కుసుమిత-ద్రుమదళ-శోభినీం,
సుహాసినీం సుమధుర-భాషిణీం
సుఖదాం వరదాం మాతరం.

సప్తకోటీ-కంఠ-కలకల-నినాద కరాళే,
ద్విసప్తకోటీ-భుజై-ర్ధృత ఖర కరవాలే,
కే బలే మా తుమి అబలే!
బహుబల-ధారిణీం నమామి తారిణీం
రిపుదళ-వారిణీం మాతరం.

తుమి విద్యా తుమి ధర్మ,
తుమి హృది తుమి మర్మ,
త్వం హి ప్రాణాః శరీరే.

బాహుతే తుమి మా శక్తి,
హృదయే తుమి మా భక్తి,
తోమార ఇ ప్రతిమా గడి
మందిరే మందిరే.

త్వం హి దుర్గా దశ ప్రహరణ ధారిణీ
కమలా కమల-దళ-విహారిణీ
వాణీ విద్యాదాయినీ
నమామి త్వాం.

నమామి కమలాం అమలాం అతులాం
సుజలాం సుఫలాం మాతరం,
వందే మాతరం
శ్యామలాం సరళాం సుస్మితాం భూషితాం
ధరణీం భరణీం మాతరం.

బంకించంద్ర.

# ఋషి బంకించంద్ర

పురాతనమైన యీ పుణ్య భూమిలో మహనీయులైన ఋషులు, ఏ యుగములం దుండిరో యేమో, యీ కలికాలమున నీ పతితజనుల మధ్య నా మహనీయులు ప్రభవింపరనియే పలువురు భావించు చుందురు. ఇది మున్నాటికి పొరబాటు. ఇది సనాతనమైన గడ్డ. ఈ ప్రజ సనాతన మైనది. మన మతము సనాతనము, ఇందలి చేవ చావనేరదు. తాత్కాలికముగా నేతన్మహిమాదికము ప్రచ్ఛాదితమైనను ప్రలుప్తము కాజాలదు. వీరులు, ఋషులు, యోగులు భరత భూమికి నిసర్గ ఫలములు. వారు ప్రభవింపని యుగము లేదు. అర్వాచీన యుగమున జన్మించిన ఋషిసత్తములలో అనన్యుడు, 'వందే మాతరమ్' మను మంత్రమును కన్న మహనీయుడు బంకించంద్రుడు.

ఋషికి యోగికి భేద మున్నది. అతిశయ పావిత్ర్యముగాని అనన్యాన శీలముగాని ఋషికి ముఖ్య

లక్షణములు గావు. అత డెట్టివాడు అను నది ప్రధానము గాదు, తదుద్గతమైన వాణియే ప్రధానము. మానవ కోటి కంతటికి గాని, ఒం డొక జాతికి గాని జీవమును స్పందింపజేయు మహత్తర సందేశ మొకటి భగవంతు డనుగ్రహించు నపుడు ఋషి ముఖ మందుల కాధార మగును. తేజోవంతమైన దివ్యాశయమును దైవము ప్రదర్శించునపుడు, తొలుత నది ఋషికనులకు దృగ్గోచర మగును. తా నందుకొన్న సందేశమును, తన కనుగ్ర హింపబడిన దివ్య దర్శనమును ఋషి తన యావచ్ఛ క్తితో లోకమునకు వెల్లడించును. ఆ సుముహూర్తమున నాతని నోట వెల్వడు దివ్యాక్షరములు మానవ హృదయ ముల నుత్తేజిత లూగించి, మనోమాంద్యమును పార ద్రోలి, అరుణకాంతులతో జాతిజీవనమును వెలిగించి వేయును. అట్లు ప్రోక్తమైన సుశబ్దములే ఒక మంత్రము. ఆ మంత్రమును వెల్లడించుటకే ఆ ఋషి జన్మించినది. ఋషి మంత్రకృత్తు.

బంకించంద్రుని నామ మెందుకు పూజనీయమైనది ? అతడు చూచి మనకు చూపిన దివ్యాదర్శ మేమి ? మన కత డనుగ్రహించిన సందేశ మేమి ? కవితాశక్తి, కల్పనాశక్తి, మృదుమధుర రచన, లలిత పాత్ర నిరూ

పణ – ఇ వన్నియు నాతనికి గలవు. వంగసాహితి కత డాక మూలకంబము. కాని ఇందులకే అతడు లోకపూజ్యుడు కాలేదు. అతని శిల్పమునకు ముఖ్యోదాహరణము లుగా 'కపాలకుండల', 'విషవృక్షము', 'కృష్ణ కాంతుని మరణశాసనము' కాంచగల ,మన్నన కన్నను 'దేవి చౌదరాణి', 'ఆనంద మఠము', 'కృష్ణ చరితము' 'ధర్మ తత్త్వము' పొందగల గౌరవము తక్కువయే కావచ్చును. కాని యీ కడ రచనల వల్లనే బంకిం చంద్రుడు ఆధునిక భారత నిర్మాతలలో ముఖ్య స్థానము నాక్రమించుకొన్నాడు. పూర్వ రచన లందు బంకిం కవి, శిల్పి. చరమ రచన లందలి బంకిం ఋషి, దేశోద్ధారకుడు.

కేవలము కవి, రచయితగా బంకించంద్రుడు వంగ దేశమునకు, తద్వారా భరతఖండమునకు చేసిన సేవ సైతము 'అమోఘమైనది. ఒక జాతి యెదుగుచున్నపుడు, దాని నవజీవనమును వెల్వాటించుటకు తగిన భాషా పరి కరము ఆవశ్యకము. క్రొత్తక్రొత్త భావపరంపరలను వహించి యమందగతి ప్రవహింపగల భాషావాహిని యేర్పడవలెను. అట్టి వాహినియే సకల జన హృదయ కేదారములను భావసస్య సమృద్ధము గావించును. భరత ఖండమున ముందడుగు వైచియున్న వంగజాతికి సకల

భావ నిర్వాహ దక్షమైన భాష నొసగుట యీ ఖండమున కంతకు బంకించంద్రుడు చేసిన తొలిసేవ. బంగాళీ భాష నతడు వాడుక చేసిన విధమున, దాని పారిశుద్ధ్యము నాతడు 'పాడుచేసె' నని నిందించిన వారునుం గలరు. 'పాడిచేసినాడు.' - అని మనము చెప్పవలయును. ప్రాచీన కవులయు, పండితులయు వాక్కునే యొరవడి చేసికొని యున్నచో, నవోత్సాహ సంభరితమైన వంగ హృదయము నతడు వెల్లడింపజాలడు. పూర్వాచార పరాయణతయే వ్యక్తమైయుండును. జాతి పరివర్తితము, విస్తృతము నగుచున్న కాలమున పరిణామ వ్యాప్తి సాధకమైన వాక్కు కావలసియుండెను. బంకిం భాషకు ఆ పటిమ యున్నది. పండితభాష గాక, పామరభాష గాక, అది 'కలగలు' పను నాక్షేపమును వచ్చినది. పండితభాషనే ఆశ్రయించినచో అది వర్ధమాన మగుచున్న జాతీయభావసంపదను, వైచిత్రిని, విస్తృతిని అడంచి వైచియుండును. పరిశ్రమ సాధ్యములై, పాండిత్య ప్రకర్షను ప్రదర్శించు వ్యాసాదికమునకు గాక, నవనవోన్మేషమైన జాతిప్రతిభను వెల్లడించుటకు తగునైన భాష కావలసియుండినది. సంస్కృతమునం గల గౌరవ పాటవ లావణ్యములతో దేశభాషలం గల నుడికారపు సొంపు

పెంపులను లగుబిగువులను పొందిక చేసి ఎంత ఉదాత్తమో అంత ధారావాహికమైన భాష మనకావశ్యకమై యుండి నది. మన అవసరమును బంకిం గుర్తించినాడు. దానిని తీర్చుటకే అతడు ఉత్ప్రేరితుడైనాడు. వంగజాతి తన హృదయమును తనకు తాను విప్పి చెప్పుకొన నను వైన వాక్కు నతడు ప్రసాదించినాడు.

దేశముయొక్క పురోభివృద్ధికి భాషావిషయిక మైన లోటును అతడు గుర్తించి తీర్చినట్లే రాజకీయ మైన లోటును సైతము అతడు గుర్తించి తీర్చినాడు. ఆ కాలమున వ్యాపించియుండిన రాజకీయాందోళనా పద్ధతులు నిస్సారములు, నిష్ప్రయోజనములు నని తెలిసికొని నిర్దాక్షిణ్యముగా వాటిని 'లోక రహస్యము' 'కమలాకాంతుని దఫ్తరు' మున్నగు రచనలందు గేలి సేసినాడు. కాని విమర్శతో నాతడాగలేదు. దేశమునకు బంధ విమోచనప్రాప్తి కేమి కావలయునో అది ఆతని అంతస్సునకు ప్రత్యక్షమై యుండెను. పాలకుల నిర్బంధ శక్తి నెదుర్కొనుటకు పాలితులకు అంతకన్న దృఢ మైనశక్తి, జాతిబల మన్నది కావలెనని అత డెఱుగును. శ్వాన మార్గమును వదలి సింహ మార్గమును బట్టుమని ఆ మహానుభావు డాదేశించెను. అతనికి ప్రత్యక్షమైన

భరతమాత భిక్షుకి గాదు, వీరస్వరూపిణి. చేత జోలె దాల్చినది గాదు, ద్విసప్తకోటి భుజోద్ధృత ఖడ్గ ధారిణి. 'ఆనందమఠము', 'దేవిచౌదరాణి' ఈ నవలలలో వ్యంగ్యముగ, వ్యక్తముగ, ఉదాహరణ ప్రాయముగ అతడు శక్తిని సందేశించినాడు. భుజబలమునకు మూలమైయుండు వలయు నంతశ్శక్తిని, ధర్మబలమును అత డద్భుతముగా నాలోకించినాడు. ధర్మబలమునకు త్యాగము ఆధారము. దేశమునకై పరిపూర్ణత్యాగము, విమోచనకార్యమునకు ఆత్మార్పణము కావలయునని తెలిపినాడు. మాతృభూమికి రక్షకులుగా, ఆరాధకులుగా నాతడు చిత్రించిన మూర్తులు రాజకీయ విరాగులు. ఆ వైరాగులకు మాతృసేవ యేకైక ధర్మము. మాతృకార్యము నెరవేరువఱకు తక్కినదెల్లను వా రెడద్రోచిన వారు; దేశమునకన్న స్వదారాపుత్రార్థముల నెక్కుడుగా గణించువాని దేశభక్తి అసమగ్రము. దేశ మోక్షణ మను మహాత్కార్యము వానివలన నెఱవేఱ జాలదు.

ధర్మబలమునకు బంకిం గుర్తించిన మరొక ముఖ్యాంశము—ఆత్మ నిగ్రహము, సామాజిక నిగ్రహము. 'దేవీ చౌదరాణి' పొందిన క్రమశిక్షను విపులముగా నిర్వర్తించుటలోను, 'ఆనంద మఠము' నందు నిరూపించిన

సామాజిక విధులలోను ఈ యంశమును బంకిం మన మనస్సులకు దెచ్చినాడు.

ధర్మబలమునకు మఱొక ముఖ్యాంగము దేశారాధనమున మతావేశము పొందుపడుట. దేశభక్తి యన్నది రాజకీయము గాదు, మతము. ఇది బంకిం లేఖిని ప్రసాదించిన మహోప దేశము. 'దేవి చౌదరాణి' లోనే దీని సూచన లున్నవి. 'ధర్మతత్త్వము'' కృష్ణచరితము' లందు బహుముఖమైన కర్మయోగమును చిత్రించి దీని కంతకు దేశసేవ, జాతిసేవ చరమాంక మని నిరూపించినారు. 'ఆనందమఠము' నకంతకు దేశోద్దిష్టమైన యీ మతావేశమే ప్రాణము. ఇది ఆ 'వందేమాతరం' గీతాకృతితో పరిపూర్ణముగా ప్రభవించినది. దేశమందు సర్వత్ర గీయమానమైనది. భరత ఖండమున కఖండమైన జాతీయ గీతమైనది. మహనీయుడు బంకిం చంద్రుడు దేశమునకు చేసిన మహోప కారములలో రెండవది యిది – దేశారాధన మతము. ఈ మతము దేశము నిపుడు ఉఱ్ఱూత లూచుచున్నది. దీనికి ద్రష్ట, గురువు బంకిం చంద్రుడు.

మూడవది – దేశమునకు బంకిం చేసిన అనుత్తమమైన సేవ మఱొకటి – మాతృమూర్తిని మనకు ప్రత్యక్షము చేయుట. 'జన్మభూమి', 'జన్మభూమి' యను బుద్ధి

భావన చాలదు. స్వాతంత్ర్యము 'అభిలషణీయ' మన్న ఆకాంక్షయు చాలదు. దేశము నందలి సకల వర్గముల వారును, ఆంగిలేయుల భృత్యాను భృత్యులు సహా వీటిని కాదను వారు కారు. కాని దేశమూ, స్వార్థమూ యని గండకత్తెరలో పడినప్పుడు మనలో ననేకులు దేశ కార్యమును తొలగ ద్రోసికొని, స్వకార్యోన్ముఖు లగుదురు. స్వాతంత్ర్య సిద్ధి నందఱు కోరు వారైనను, సంకల్ప బలము కొందఱికే కలదు. స్వాతంత్ర్య సాధనలో మనకు ప్రియ తరము లైన యితరముల వదలుకొన నొల్లము. ఈ క్షుద్రాపేక్షలు, యీ సంశయములు, యీ సంకుచిత భావములు – ఇవన్నియు పటాపంచలై మాతృ సేవా పరాయణత్వ మను మహావేశము జనించుటకు, అథఃపతితమైన దేశము నత్యున్నతికి దేగల యద్భుత కార్యము లొనర్చుటకు, దేశ మన కేవల మొక గడ్డ యని గాని, జన సమూహ మని గాని యోచించుటలు చాలవు. దివ్య సౌందర్య సంపన్నమైన, మహా మోహనమైన మాతృమూర్తి, జగదంబ, పరాశక్తి మనకు దృగ్గోచరము కావలయును. ఈ మూర్తిని సాక్షాత్కరించుకొని, ఇతరులకును దర్శన భాగ్యము కల్గించుపుణ్యము కొందఱికే యబ్బును. బంకించంద్రుడు

ముప్పది మూడేండ్ల క్రిందటనే వందేమాతరం గీతిని ఆలపించినాడు. వినిన వారే లేరు. కాని వంగీయులు భ్రాంతిముక్తులై సత్యాన్వేషణులై దిక్కులరయు నప్పుడు, ఎవడో సుముహూర్తమున నీ 'వందేమాతరం' పాడినాడు. మంత్ర ముచ్చరిత మైనదో లేదో సమస్త జనులు ఈ మాతృ సేవా మత స్వీకారము చేసినారు. మాత ప్రత్యక్షమైనది. దర్శన మనుగ్రహించినది. ఇక ఆ వెనుక జాతికి తిరుగు లేదు, ఆపు లేదు, నిద్ర లేదు. ఒకే కార్యపరత– ఆలయ నిర్మాణము, బింబ ప్రతిష్ఠ, బలి సమర్పణ. ఆ దివ్య దర్శన మందిన దేశము మఱి దాస్యమునకు లొంగదు. పర పాలనకు అఱ్ఱోడ్డదు.

'వందేమాతరం' పత్రిక— ౧౬–౪–౧౯౦౭. ]

# బాలగంగాధర తిలక్

తిలక్ మహాశయునిగూర్చి గాని వారి ఉపన్యాసములనుగూర్చి గాని పరిచయవాక్యము లనవసరము. వారి యుపన్యాసములు నిర్గుణబ్రహ్మము వలె స్వయం ప్రకాశములు. శబ్దాడంబరము లేక, భావము సుస్పష్టముగా సుప్రసన్నముగా, చెప్పదలచుకొన్నది ఘంటాపథముగా ఘోషించునవి. ప్రత్యక్ష ప్రమాణములు, వ్యాఖ్యానిరపేక్షములు నైన సూత్రముల మాలికలవి. తిలక్ మహాశయులుగాని, వారి జీవయాత్రగాని, భారత రాజకీయములందు వారిస్థానముగాని యివియు బ్రత్యక్ష ప్రమాణములే. వాద ప్రతివాదముల కవకాశములేదు. వారి పేరన్న ఉలికిపడువారు, వారి గౌరవోన్నతి నుపద్రవముగా నెంచువారు కాదనుటకు వలనుపడని సత్యమిది. భారతదేశమున నేర్పడియున్న పరిస్థితులలో, రాజకీయ లక్ష్యము కాదగిన దొక్కటే, దానిని సాధించు తత్త్వమార్గమును ఒక్కటే. మఱి తన్మార్గగామి, ఈ

మానవుడు రావలసినదే. వచ్చినపిమ్మట అగ్రయాయి కావలసినదే. భారతజాతి లక్ష్యమును సాధించుట కవతరించిన వాడుగా, జాతీయోద్యమము రూపుగొన్న వాడుగా, ప్రజానీకము ఆరాధించుచున్న యిద్దరుమ్ముగ్గురు మహానాయకులలో నొకడుగా నిత డేర్పడక తప్పినది గాదు. స్వరాజ్య మన్నను, స్వపరిపాలన మన్నను, ఏపేరు పెట్టినను ఇప్పటి మన యుద్యమమునకేకైక లక్ష్య మైనది ప్రజాసమ్మత మైన భారత జీవన స్వాతంత్ర్యము. దీనికి తిలక్ గారి యుపన్యాసము లన్నిటంగల వాద దార్ఢ్యమున కన్న పటుతర మైన వాదము వారి జీవితము, వారి నడవడి, వారికృషి, వారిసహనము, తదర్పితమైన జనాంగీకారము. వాదములవలన, మాటలవలన దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధింపదు; కాని ఒక జాతి స్వతంత్ర గావలెనని ఆత్మ నిశ్చయము చేసికొన్నప్పుడు, ఆ నిశ్చయ మొకనియందు మూర్తీభవించినపుడు, ఆ మూర్తి సకల కష్టములోర్చి జీవిత సర్వస్వమును, ఆ కృషియందే వినియోగించి నప్పుడు, 'ఇతడు, ఇతని జీవితమే నా హృదయము, నా లక్ష్యము' అని జాతి ఒక్కమారు ఘోషించినప్పుడు సిద్ధి సన్నిహిత మనియే గుర్తింపవలెను. ఎవరికిని అనుమానమున కవకాశములేదు.

ఆ దృఢసంకల్పము, తిరుగులేని ఆ కార్యదీక్ష - ఇవియే తిలక్ జీవితమునకు సమగ్ర నిర్వచనము. ప్రజలపై వారికి గల ప్రభావమున కవియే కారణము. సామాన్యముగా ఈ దేశమున రాజకీయ నాయకత్వ మున కాధారములైన సిరి సంపదలుగాని, కుల గౌరవ ములు గాని, వృత్తి విజయము గాని, ప్రభుత్వామోదము గాని, ఉపన్యాస సమ్మోహనముగాని, వక్తృత్వకౌశలము గాని - ఈ సహాయకములు - వారికి లేవు. వారి ప్రాము ఖ్యతకు కారణము వారే, వారి జీవిత పరమార్థమే. అందులో అఱ గొఱలు లేవు. వారి యావచ్ఛక్తి, యా వచ్ఛేముషి అందులో నిబిడమైయున్నవి. స్వార్థమునకు గాని, వేఱు లక్ష్యములకు గాని వారించు కేనియు నిలుపు కొనలేదు; సర్వమును దేశమున కిచ్చి వైచినారు. తమ జీవితమే దేశలక్ష్యమునకు సాధనగా సమర్పించినారు.

వారు మహామేధావులు. వారికిగల ప్రతిభా శక్తులు సామాన్యమైనవి గావు. వానివలన వారికి అనేక మార్గము లందు ఇక్కాలమున నే గొప్ప మెప్పును, కల కాలమును స్థిరయశస్సును కల్గియుండవచ్చును. న్యాయ వాదివృత్తిని వారు స్వీకరించలేదు గాని తర్కకర్కశ మైన బుద్ధి, న్యాయశాస్త్రప్రావీణ్యము వారి కెంతేని

గలదు. ద్రవ్యముగాని, పదవిగాని వారు లక్షించి యున్నచో న్యాయవాది వర్గమునం దగ్రగణ్యులై యుండ గలరు. సంస్కృతమున వారు మహాపండితులు. భావనా బలము, రచనా పాటవము మిక్కిలిగా గలవారు. ప్రాచ్యవిజ్ఞాన పరిశోధక విద్వాంసులం దనుత్తములై యుండగలరు. అన్యకార్య నిమగ్నులయ్యును, వారు రచించిన గ్రంథములు 'Orion', 'Arctic Home' ప్రపంచఖ్యాతి బడసినవి. ఎప్పటి కప్పుడు సిద్ధాంతములు తారుమారు అగుచున్న ప్రాచ్యపరిశోధనలందు లఘువుగా త్రోసిపుచ్చ వలనుపడక వీరి నిరూపణలు పటిమతో కొంత నిలబడ్డవి. భగవద్గీతపై వారి భాష్యము కేవల మొక వ్యాఖ్యగాక స్వతంత్రమైన మహత్ గ్రంథము. పరమ సత్యమును, నైతిక ధర్మమును స్వతంత్రముగా నిరూపించునది. మరాఠీభాషలో వచనరచనకు మేలు బంతిగా నున్నది. గీతారహస్యము నొక్కదాని నెత్తు కొన్నను వారు సారస్వతసేవలో నిమగ్నులై యున్నచో మరాఠీ వాఙ్మయకర్తలం దగ్రస్థానము వహించి యుందురని, ధర్మప్రవక్తలం దద్వితీయులు గానుందురని మనకు తోపగలదు. కాని తిలక్‌గారి నెందులకు ధాత సృష్టించెనో ఆజీవిత లక్ష్యమునకు దక్క తక్కిన విషయ

ములకు వారి శక్తి యెక్కువగా వినియుక్తమగుటకు వారి మన స్సొప్పజాలదు. అందువలననే శక్తివంతమైన వారి లేఖిని గ్రంథరచనకు మారుగా పత్రికా రచనమందే విశేషించి పరిశ్రమించినది. పత్రికారచన ముత్తమమైన దయ్యు దాత్కాలికమేగాని దీర్ఘాయుస్సు గలదికాదు. అయినను అట్టి పత్రికారచనమందును వారు అద్భుత ప్రతిభను, శక్తిని, సాహసమును చూపినారు. నలువది యేబదేండ్లు పట్టు రాజకీయ ప్రబోధమును నాలుగైదేండ్లలో కల్గించినారు. ఇది అసామాన్యమైన పని. దీనికి పై చేయి కానరాదు. మఱి వారి విద్వత్కృషి యెల్ల యించుమించు వినోదార్థముగా జరిగినది. వారిని వారి జీవితకృషినుండి వేఱుచేసిన నిర్బంధవాసమందో ప్రవాసమందో విద్వన్మణిగా వారికి పేరు దెచ్చిన బృహత్ గ్రంథములు విరచితమైన సను విషయము గమనింపదగినది. అప్పుడు దప్ప, జైలుబయట నీ దేశారాధకునకు తీఱిక యెక్కడిది? ఆ గ్రంథములందు సైతము వారి జీవితలక్ష్యమునకు సంబంధించిన మూలభావమే ప్రసక్తమై యున్నది. ఈ దేశముయొక్క పూర్వౌన్నతిని పునరుజ్జీవింప జేయుటయే వారి ప్రధానోద్దేశ్యము. వైదిక వాఙ్మయ పరిశోధన చేసి, ఆదిమ నివాసమునుండి ఆర్యులు

వెడలివచ్చిన కాలమును వారు నిర్ణయించినారు. గీతా రహస్యమునందు వారు సర్వారాధ్యమైన గీతను చేపట్టి అది బోధించు ఆధ్యాత్మికజీవనమున కందుగల ప్రమాణ వాక్యముల చేతనే ఐహిక జీవితము, కర్మాచరణము, జాతి సేవ, మానవసేవ మున్నగా గల యాధునిక పరమాశయములను జోడించి, సమరసించి, ఉపదేశము గావించినారు. తిలక్‌గారి జీవితమున దశల మార్పులు మహారాష్ట్రమునకు భరతవర్షమునకు గూడ దశలమార్పులై యున్నవి. వారి మొదటిదశ వారి రాష్ట్రమునకు విద్యాదాయకము ప్రబోధదాయకము నైనది. ఒకవంక ఫెర్గూసన్ కాలేజి స్థాపనము, మరొకవంక 'కేసరి' పత్రికా స్థాపనము, వారి ప్రథమదశలోనివి. రెండును జాతి ప్రబోధ కుద్దిష్టమైనవే. త్యాగజీవుల సహకారముతో నవవిద్యాప్రదాయి కళాశాల. మహారాష్ట్రము నందలి నవీన రాజకీయోత్సాహమునకు వాణియైనది పత్రిక. తిలక్‌గారి జీవితకృషిని మూడు దశలుగా విభజింపవచ్చును. ఒక్కొక్క దశచివరను కారాగారవాసఘట్టము. కొల్హాపురము కేసులో జైలుశిక్ష వారి మొదటి దశకు సమాప్తి. దానితో వారును వారితోటి మహారాష్ట్రమును అభ్యుదయ మార్గమునందొక దశ దాటి

నట్లు, దేశమునకు పురోభివృద్ధి దాయకములైన నూతన భావములను, నూతన సంరంభములను నిలద్రొక్కి నట్లు.

రెండవదశలో తిలక్‌గారి సంకల్పము విస్తరించినది; ప్రయత్నము మరింత గభీరమైనది. ప్రజలో రాజకీయోద్బుద్ధి కల్గించుటయే గాక, ప్రజాహృదయమును మేలుకొల్పి భూత భవిష్యత్ సంకలనము గావించుటయైనది. ప్రజలమధ్య తీవ్ర ప్రచారముతో నీ కృషి సాగినది. శివాజీ ఉత్సవములు, గణపతి ఉత్సవములు నెలకొల్పుటతో నీప్రయత్నము పరమావధి నొందినది. సంఘసంస్కారోద్యమ నాయకుడైన అగార్కరుగారితో తిలక్ విడివడుటవలన వారినాయకత్వమున కొక ప్రత్యేక విలక్షణత యేర్పడినది. సార్వజనీనమైన నవ రాజకీయములందు పూర్వాచారపరమైన భారతప్రజకు తిలక్ ఏకైకనాయకుడై నిలిచినాడు. మత విశ్వాసము చెడని భారత ప్రజ వారిని విశ్వసించినది. ఇందువలననే వారు నవీన రాజకీయోత్సాహమును ప్రాచీన సాంప్రదాయముతో జోడింప గలిగినారు. ఈ రెంటిని శాశ్వతమైన మతాభిమానముతో సమరసించినారు. కాంగ్రెసు ఉద్యమము అంతవరకు పెక్కేండ్లుగా కేవలము పాశ్చాత్య పరిజ్ఞానముతో కూడుకొని యుండినది. ఆంగ్లభాషావేత్త

లైన కొలదిమందికే అది వ్యాపించి యుండినది. ఆంగ్ల దేశచరిత్రను, ఐరోపాఖండ లక్ష్యములను మనసులం దిడుకొని ప్రజల హక్కులను నిర్వచించుటయే పరి పాటియై యుండినది. హిందూదేశముయొక్క అంత రాత్మతో గాని పూర్వచరిత్రతో గాని ఆయుద్యమము నకు బంధ మేర్పడి యుండలేదు. అట్టి బంధము నేర్పఱ చిన మొదటి రాజకీయనాయకుడు తిలక్. గతమునకు వర్తమానమునకు లంకె వేసినవాడు. రాజకీయోద్యమ మును సర్వవిధముల జాతీయము గావించిన వాడు. ప్రజా నీకమును ఉద్యమములోనికి చేరదీసిన వాడు. తిలక్ ఈ దశలో గావించిన కృషి వలననే మహారాష్ట్రమునం దెల్లెడల ఉత్సాహవంతము శక్తివంతము నైన ప్రజా సముద్యమ మేర్పడినది. విషమ పరీక్షలందు నెగ్గి నిల బడినది. ప్రజాహృదయమును గుర్తించి, దేనివలన వారి యుత్సాహము వెల్లివిరియునో ఆ మార్గము పట్టుటలో తిలక్ గారి రాజకీయప్రతిభ చక్కగా నిరూపితమైనది. దేశమును గట్టెక్కించగల మహానుభావు డితడే నని రూఢిపడినది. మహారాష్ట్రమునకు తిలక్ చూపిన దారినే భారతదేశమున కంతకు స్వదేశీ ఉద్యమము చూపినది. భారతదేశమున సార్వజనీనమైన రాజకీయ

ప్రబోధ ముద్వేలముగా గల్గుటకు తప్పనిసరిగా చేయ వలసినది ప్రజనాకర్షించుట, పూర్వోన్నతి నాధారము చేసికొని భవిష్యత్తును సాధింపబూనుట, మతావేశము రాజకీయము నావేశింపజేయుట. విజ్ఞులు కొందఱిది మనోదృష్టిని చూచినవారేగాని కార్యాచరణ యోగ్య ముగా రాజకీయరంగమున దీనిని ప్రవేశపెట్టినవారు తిలక్. దీనికితడే ప్రథముడు. ఈ రెండవదశకు సహాస్తి మఱెంత దీర్ఘమైన, క్రూరమైన కారాగార వాసము. ఈ నిర్బంధవాసమే వారికృషిపై దైవమిడిన ముద్ర. ఒక లక్ష్యమున కొక మహనీయుడు సహించు కష్టభార మందే దైవామోద మిమిడియున్నది.

వారి మూడవదశ స్వదేశీ ఉద్యమారంభము. దీనితో తిలక్ అఖిలభారత నాయకుడుగా ప్రకాశించి నాడు. మహారాష్ట్ర మందేగాక భారతదేశ మందంత టను తన జీవితకృషి ఫలప్రదమగుటకు చివరకు అవ కాశము లభించినది. ఈ దశలోని వారిజీవితోదంత ములు సన్నిహితములేగావున జ్ఞప్తి పరుప నక్కఱలేదు. బ్రిటిషు వస్తు బహిష్కారముతో ప్రారంభమై, సూరతు కాంగ్రెసు కలహమువఱకు సాగి, వారి చరమ కారా గార వాసముతో అంతమైనది ఈ మూడవదశ. వారి

యీ జీవిత ఘట్టము భారతదేశచరిత్రలో నొకఘట్టము. మూడుసారులు వారికి ప్రాప్తమైన కారాగారవాసములు ముమ్మారు వారి యాత్మశక్తిని, నిసర్గోన్నతిని నిరూపించినవి. 'ఈ కాంచనములో కందులే' దని ఆ యగ్నిపరీక్షలు ఋజువుచేసినవి. తొలి పరీక్ష నాటికి, దేశారాధనకు కంకణముగట్టిన యొక చిన్నబృందమునకు తిలక్ మొదటివాడుగా నిలిచినాడు. రెండవ పరీక్ష వేళకు మహారాష్ట్రీ జాతీయ ప్రబోధమున కతడు మూలశక్తియై, దక్షిణాపథమునకు ఏకైకనాయకుడుగా నేర్పడినాడు. వారి ప్రశస్తి భారతదేశమం దంతను వ్యాపింప జొచ్చినది. మూడవ పరీక్షసమయమునకు తిలక్ యావద్భారతోద్యమమునకు నాయకుడు. సమగ్రమైన జాతీయవాదము నకు కర్త, వక్త, ముఖ్యపురుషుడు. భారత ప్రజాలోకమంతయు పూజించు నిద్దఱు ముగ్గురు నాయకులలో నొకడు. దేశమునుంగూర్చి వారుచేసిన యావజ్జీవకృషి యిపుడు చరమదశయం దున్నది. విజయవంతము కావచ్చునను ఆశ యిప్పటికి భాసించుచున్నది. స్వరాజ్యకాంక్ష యన్నది కడతేరునా, ఫలసిద్ధి యెంతకాలమునకో యేమో, యే వందయేండ్లు కష్టపడవలయునో, అన్నది యిపుడిపుడు సన్నిహిత మనిపించు చున్నది.

వారికి ఆధారభూతములై విజయ సాధనములైన గుణములు భారతరాజకీయము లందపూర్వములు. అందు మొదటిది స్వరాష్ట్ర స్వజాతి ప్రాతినిధ్యము. తమప్రాంతమైన మహారాష్ట్రమునకు వారు నిసర్గ నాయకులు. భారతజాతిలో వైవిధ్య మున్నది. బహుప్రాంతములందు బహుగణము లున్నవి. ఆ యా ప్రాంత జనమున కొక్కొక విశిష్టత యున్నది. ఆ యా ప్రాంతముల జీవనసారము పైననే భరతఖండముయొక్క జీవచ్ఛక్తి ఆధారపడి యున్నది. తన ప్రాంతమునందు గట్టిపట్టు కలుగజేసికొని స్వజాతిని వశమొనర్చుకొన్న నాయకుడే భరతదేశమున కంతకు నుపకారి కాగలడు. దేశసేవ కది పునాది. తిలక్ నాయకత్వమున కీ పునాది పరిపూర్ణముగా నుండినది. మహారాష్ట్ర జాతిగుణము లితనిలో మూర్తీభవించినవి. వీనికితోడు మహాపురుష లక్షణములైన ప్రతిభ, చైతన్యశక్తి, సంకల్పశుద్ధి, చేరినపుడు ఇతడా జాతికి ముఖపురుషుడుగాక యేమగును? దేశ స్థితిగతుల వలన నేమి, చారిత్రక విపర్యాసములవలన నేమి మహారాష్ట్రులు తీరిన ప్రకారము – దృఢకాయులు, శక్తిమంతులు, సమత్వప్రియులు, కుశాగ్రబుద్ధులు, కర్మాచరణ నిరతులు, లౌకిక కార్య కుశలులు. కావ్య మత విజ్ఞా

నాదు లందున్నైతము పార్థివబంధమును వదలని వారు, సోత్సాహులైనను ఉద్వేగులు కానివారు. భావము నందును, భాషయందును, పటిమ ద్రఢిమ స్పష్టత పాటించువారు. విద్యలందు, పాండితియందు శ్రద్ధ,ఓపిక, మెలకువ కలవారు. నిత్యజీవనమున నిరాడంబరులు. మితవ్యయులు, సహనశీలురు. స్వభావసిద్ధముగా ధైర్య స్థులు, దృఢమతులు, కష్టమునకు వెనుదీయనివారు. కార్యసాధన మందు నేర్పరులు. రాజనీతి కుశలురు. సమరప్రియులు. ఇన్నివిధముల నారితేరినవారు. ఈ లక్ష ణము లన్నియు తిలక్ గారిలో సమగ్రముగా నతిశయిల్లి యున్నవి. వీనికి దోడు మహానుభావుని సుప్రసన్నత. పటిష్ఠమైన సంకల్పము, పరిపూర్ణమైన కార్య దీక్ష, అపూర్వమైన అంతశ్శక్తి తిలక్ గారి యందు మేళవించి నవి. చక్కని ఒరలో నమరియున్న మెఱుగారు ఖడ్గా యుధమువంటిది వారిశక్తి. రాజకీయ రంగమున వారు మూర్తిగొన్నపుడు, జనులు తమజాతి గుణములు పరి పూర్ణాకృతిదాల్చిన మూర్తిగా గుర్తించిరి. ఇతడు తమ ప్రతినిధియని యెఱింగిరి. తమజాతి నిర్మాతలైన పూర్వ పురుషుల యపరావతారముగా గణించి పూజించిరి. మహారాష్ట్రజాతి తేజము మరల నొక మహాపురుషు

నందు రూపుగొని ప్రత్యక్షమైన దని విశ్వసించిరి. స్వరాష్ట్రమున వీరికి గల ప్రభావము మరే రాష్ట్రమున మరెవ్వరికిని లేదు.

యావద్భారత రంగమందును నాయకత్వము వహించుటకు వలయు మహాగుణములు వారియందున్నవి. వారు పామర జనాకర్షియని వారి విరోధు లనవచ్చును గాని అది కేవలము సత్యదూరము. రాగద్వేషముల రెచ్చగొట్టుచు పైపూతల పచరించు వాగ్జాలముతో జనసమూహమును వశీకరించుకొను పద్ధతి వారికి లేదు. సూక్ష్మదృష్టితో చక్కగా నాలోచించి చెప్పినవే వారి యుపన్యాసములు. అనాలోచితములు తాత్కాలికములు నైన ఉత్సాహోద్వేగములకు వారు పరాఙ్ముఖులు. ప్రజల యుత్సాహము సహజముగా కొంత సంరంభముతో ప్రకటము గాక తప్పదని సహించువారే గాని తీవ్రమైన కార్యధోరణి కనువుగా నీ యుత్సాహము వినియుక్తమగుటయే వారి యీప్సితము. కాని వారు సమగ్రమైన ప్రజానాయకులు. ప్రజాహృదయమును గుర్తెరింగి తగిన దారిలో వారిని నడుపుట యందును, నాయక తత్త్వమును ప్రజాతత్త్వమున కనువు పరచుకొనుట యందును వారి ప్రకృతి విశిష్టమైనది. అనుచరులమధ్య వారు ఎడ

మచ్చుపులు లేక సహజముగా, సరిసమానముగా మెలగ గల వినయ శీలురు. కలిసిమెలసి యుండు నిరహంకారులు. మితభాషులైనను, అవసర మైనప్పుడెల్ల అనుచరులతో సలహా పడువారు. తన మనసును విప్పి చెప్పువారు. వారి భావముల నడిగి తెలిసికొనువారు. జనసముదాయము మనస్సెరుగుట, మనసిచ్చి తన యుద్దేశ్యము వారి కరమరలు లేక చెప్పుట, వారి యూహలను వారికే ప్రతిబింబింప జేయుట - ఈ ప్రజానాయక లక్షణము లన్నియు వారిలో గలవు. ఇందువలననే అన్ని తెగల వారిని ఒకనాయకత్వము క్రిందికి వారు తేగలిగినారు. విద్యార్థులు, వ్యాపారులు, గ్రామీణులు, కర్షకులు, కార్మికులు, అందఱు వారికి జోహారు లిడుచున్నారు. వారు ఏమి చెప్పినను ఏమి వ్రాసినను మహారాష్ట్రులందఱికి సుబోధ మగుచున్నది. అందఱు కార్యమార్గమున వారి ననుసరించుటకు సంసిద్ధు లగుచున్నారు. ఈ గుణములే యావద్భారత రంగమునగూడ వారి నాయకత్వ మందు రాణించినవి.

తిలక్ స్వభావసిద్ధముగా విప్లవనాయకు డని తలచుట కేవలము పొరబాటు. అది వారి ప్రకృతి కాదు. వారి రాజకీయవైఖరికూడ అట్టిది కాదు. ఉద్వేగ స్వభావులైన వంగీయు లేమో గాని, భారతీయులు

సామాన్యముగా విప్లవ స్వభావము కలవారు కారు. తఱిమి తఱిమి నేలరాచినపుడు వారేకాదు, లోకములో నే జాతియైనను తిరుగ బడవచ్చును. సహజముగా వారు తిరుగబడు వారు కారనియే చెప్పవలెను. ఉన్నతాశయములు, తీవ్రోత్సాహములు గల వారగుటచే ఒక్కొకప్పుడు మనసు నొచ్చి వారు ఉద్రిక్తులై తిరుగుబాటు చూపవచ్చును. కాని సామాన్యముగా భారతీయులు నిదానము గలవారు. ఏమిచేసినను ఆలోచించి చేయువారు, తొందరపడరు. ఇది వారి స్వభావము. తిలక్ దృఢసంకల్పుడు సమరశీలుడు నైనను, భారతీయ ప్రకృతి సిద్ధమైన నిదానము వారిలో విశేషముగా గలదు. ఉదారాశయములకు తావిచ్చు వారి విశాల హృదయములో నెట్టి యల్లకల్లోలమును లేదు. శాంతి సౌమ్యతలే చెలువారును. సాంప్రదాయపరమైన ప్రజా హృదయమునకు ముందు మిగిలి ఆతడు సంస్కారాదుల ప్రవేశపెట్టు వాడు గాడు. స్వతంత్ర భారతమున నతడు అతివాదిగా నుండియుండడు. ఒక్కొక్క మెట్టున ముందు వెనుక లాలోచించి, మితవాదమును క్రమపరిణామమును సమర్థించి యుండును. ఇదిగాక తిలక్ నిసర్గముగా సభానాయకుడు. శాసనసభాదులందు చర్చాదికమునకు

ఎత్తినవాడు. ప్రజాసామాన్యమున కుద్ఘోషించుకొనుచు త్రోసికొనిపోవు తత్త్వముకాదు. పలుమొగల కక్షుల వివాదములకు చర్చకు నిర్ణీతపద్ధతి యుండవలెనను వాడు. ఎగుడు దిగుడు పోకడ లతనికి నచ్చవు. నిర్ణీత పద్ధతికి లోబడి, అందలి సూక్ష్మ సూక్ష్మతరాంశముల చక్కగా వినియోగించుకొని తన పక్షమునకు విజయము సాధించుటయే అతని స్వభావము. అందువలననే కాంగ్రెసు సంస్థ విలువ నాతడు గ్రహించెను. పూర్తిగా స్వరూపమేర్పడకున్నను ప్రజాసమావేశమునకు అది ప్రథమ ప్రయత్నముగా నాతడు గుర్తించెను. సూరత్ కాంగ్రెస్ పిదప, పలువురు తిలక్‌గారిని కాంగ్రెస్ విధ్వంసియని నిందించిరి. నిజముగా సూరత్ చీలిక తిలక్‌గారి ప్రయోజనములకు భంగకారి. ఈ విపర్యాసమును తిలక్ కోరినవాడు కాడు. కాంగ్రెసు నిష్ప్రయోజనముగా నుండుట నతడొప్పలేదు గాని కాంగ్రెసు సంస్థ దేశమునకొక కూడలి యని, దాని మూలకముగా మున్ముందు అనేక కార్యములను సాధింపవచ్చునని అతడు గ్రహించి యుండెను. ప్రయోజనకారి కాగల సంస్థను, ఉన్నదానిని, చెడగొట్టుట అతని ప్రకృతి కాదు. అట్టి యుద్దేశ్యమే అతని మనస్సులో చొరజాలదు.

తిలక్ గారి స్వభావమున మఱొక విశేషము. వారికి పరమాదర్శము లున్నను, ఆదర్శ లోలుడుగాడు. ఆదర్శ మిది యని నిర్ణయించుకొన్న పిదప, దాని సిద్ధికి వలయు పరికరములు సేకరించుకొని కార్యాచరణ నిమగ్నుడగుటయే అతని పద్ధతి. స్థిరనిశ్చయముతో తదేక దీక్షతో, వివిధాంతరాయములను మెలకువగా తప్పుకొని, ఆశయమును సాధించువాడు. ఈ సిద్ధాంతము ప్రాణప్రద మనిగాని, ఈ మార్గానుసరణము అత్యవసర మనిగాని అతడు నిశ్చయించి నపుడు, పట్టుదల విడనాడడు గాని తక్కిన విషయము లన్నిట తగ్గు మొగ్గులు పాటింపక సమాధానము సేకొనువాడు. సగమునకు సగము వచ్చునట్లున్నచో నాకక్కఱలే దనడు. సగము తీసికొని తక్కిన సగమును సాధించు ప్రయత్నములో నుండును. వచ్చిన అంతయు రావలెను, లేదా యేమియు నక్కఱలేదు; అనుపద్ధతికాదు. కాని వెన్నకు బదులు సున్న మన్నచో మోసపోవువాడు కాడు. మాయదారులకు లోబడడు. సాధ్యాసాధ్యముల వివేచించువాడు. అందు బాటు నతిక్రమించి వృథాయాసమునకు లోనగుటయు నిష్టపడడు. ఇందువలన నొక్కొకపుడు వారి పర్యాప్తి వారి అనుచరుల యుత్సాహాతిరేకమునకు కొంత బాధక

మగు చుండెడిది. కాని కేవల మితవాదులవలె అల్ప కృషికి అల్పసిద్ధికి మిగిలిన దెల్ల అసాధ్యమని యెంచువాడు కాడు. ఇట్టి తత్త్వముగల తిలక్ సహజముగా విప్లవవాది కాడు, క్రమబద్ధుడు. కాని దేశకాల పరిస్థితులను బట్టి అతివాదపక్షమునకు నాయకుడుగా నుండక తప్పినది గాదు. తాను సంస్కరించి పెంపు జేయగల నిర్ణీత రాజ్యాంగమే అతని కనుకూలము. ఉన్న సంస్థలను ధ్వంసము చేసి కేవలము క్రొంగ్రొత్తల నిర్మించు టన్నది విప్లవకారుల వాంఛ, తిలక్ పద్ధతి కాదు.

ఇట్టివాడు గావుననే, సంఘసంస్కారోద్యమమున కతడు వైదొలగినాడు. అతడు కేవలము పూర్వాచార వాదికాదు. మహారాష్ట్ర జాతియే మూఢవిశ్వాస బద్ధము కాదు. ఇతర ప్రాంతములలో అటు ఆచార వ్యామోహమో, ఇటు సంస్కారవ్యామోహమో ఉప్పొంగి తిల్లవచ్చునుగాని మహారాష్ట్రులు కుదురుపాటు గల వారు. తమ సంఘ వ్యవస్థను విడనాడుకొనరు. కాని, కాలానుసారముగా సదుపాయము చేసి కొనగలరు. ఆ జాతి గుణమే తిలక్‌గారికిని గలదు. ఇదిగాక రాజకీయ పరిస్థితులంబట్టిగూడ వారు చక్కగా నాలోచించిరి. సంఘ వ్యవస్థలో మారుబాట్ల నభిమానించు సంస్కారో

ద్యమమును రాజకీ యోద్యమముతో జోడించిన యెడల ప్రజాసామాన్యమునకు రాజకీయములకు సంబంధము సన్నగిల్లవచ్చును. ఒక్కొక మారుబాటులం గూర్చి అనేక కక్ష లేర్పడవచ్చును. ఈ కక్షలతో రాజకీయోద్యమము ఏకముఖముగా నడచుటకు వలనుపడక భిన్నభిన్నముగా వచ్చును. దేశము స్వతంత్రమైన పిదప, కాలానుగుణ్యముగా సంస్కారమును నిర్దేశింపగల ప్రజాపరిషత్తు యేర్పడినవెనుక, ప్రజాభీష్టము నరసి సంస్కారములను నిర్వచించి, నిర్వహింపవలసినదే గాని ముందుగా నట్టిపనికి దొరకొనుట తగదని ఆత డెంచెను. రాజకీయోద్యమము ప్రధానమని, దేశస్వాతంత్ర్యసిద్ధి పరమాశయమని, తక్కినవెల్ల వెనుక కొదిగి యుండవచ్చునని నాతని అభిప్రాయము. వారి జీవితపంథ అట్టిది. దేశమునకును ఆ పంథయే సరియని వారి భావము. 'ముందు స్వాతంత్ర్యమురావలె, జాతిజీవనమునకు మనము కర్తలముకావలె, అంతవఱకు సంఘవ్యవహారము లందు వాదప్రతివాదము లెందుకు? కలహావకాశము లేక సర్వ సమ్మతమైన మార్పులతో సదుపాయముగా సాగిపోవల యును' — అని వారి తాత్పర్యము. ఇది ఒప్పో, తప్పో తిలక్ గారి ప్రకృతిని బట్టి దేశ ప్రకృతిని బట్టి వేఱు

మార్గము లేదు.

కావున తిలక్ యావజ్జీవితము రాజకీయములందు కల్లోలకారకుడుగా, స్వదేశీ ఉద్యమకాలమున అతివాద పక్ష నాయకుడుగా నేర్పడుటలో గల రహస్య మరసి నచో, వారు సూక్ష్మబుద్ధితో యోచించి ముఖ్యావసర మేదియో నిశ్చయించి, దాని సాధించుటకైన మార్గ మును జంకు కొంకు లేక అనుసరించినవారే గాని యెట్టి విపరీతవాదులు గారని తేటపడగలదు. రాజకీయవాదు లందు రెండు తరహాలు గలవు. ఒక తరహావారు ముఖ్య సూత్రములను మహావసరములను కడకొత్తి, స్వల్ప స్వల్పతరాంశములందు నిమగ్నులై పోదురు. మఱొక త రహావారా చిదుగుల జోలికిపోక ముఖ్యసూత్రము లందే మనసు నుంచి, వానికి సంబంధపడినంత వఱకే సూక్ష్మాం శముల విచారింతురు. ఒకరిది గహనమార్గము. దైవ వశాత్తు వెలివడ వలసినదేగాని, లేనియెడల చెట్లచుట్టు ప్రదక్షిణములతో సరిపోవును. మఱొకరిది కొండకొమ్మున నిలిచి పరిసరారణ్య సమీక్ష. ఎన్నివంకలు తిరిగినను గమ్యస్థానమునకు పోవుమార్గ మేదో దాని ననుసరించి యుండును. తొలివారు తమకాలములో 'తాము రాజ కార్య ధురంధరులము' అనుకొందురు. మలివారినే

భావికాలములో ప్రజలు రాజకీయవేత్తలుగా, దేశీయ నాయకులుగా పూజింతురు. రాజకీయములందు మహానుభావులు ఈ తెగవారు. తిలక్ ఈ గణములోని వాడు.

భారత దేశమున రాజకీయ వేత్తలు పరిపాలకులు గాకపోవుట చేత, కార్యబుద్ధి కన్న గ్రంథబుద్ధి మెండుకొన్నది. తిలకు గారిది గ్రంథబుద్ధి కాదు. ఉన్న పరిస్థితులను గమనించి, అనువైన మార్గము నంటి ముందుకు సాగుట వారిపని. ఆంగ్ల దేశమున మాగ్నకార్టా మొదలుకొని యేడువందలేండ్లుగా జరిగిన రాజకీయ పరిణామము నొక మహాదర్శముగా గొని నేటి భారత పరిస్థితుల దిద్దుకొనుట గాని, స్వాతంత్ర్యమున కేదో క్రమక్రమాభివృద్ధిని సిద్ధాంతము చేసికొనుట గాని, చిన్నవో పెద్దవో ప్రజల కష్టములను పురస్కరించుకొని అధికారుల అజ్ఞానాంధకారమును తమ ఉపన్యాసముల వెలుగుచేత పాఱద్రోలుట గాని, తీర్మాన పరంపరలతో తృప్తి పడుట గాని,—యివి తిలకు తత్త్వమునకు సరిపడునవి గావు. ౧౯౦౫ వఱకు కాంగ్రెసు ధోరణి పైజెప్పిన తీరున నడచినది. కాంగ్రెసు ఉద్యమము నొక జాతీయావేశముగా సరితీర్చవలయు నని తిలక్ సంకల్పము. కాంగ్రెసు చేయని పనిని, తాను స్వతంత్రముగా తన ప్రాంతములో

నొక సమూహమునకు నాయకుడై నిర్వహింపగలిగి నాడు. ప్రకృత పరిస్థితులలో భారత దేశమున కుండదగిన దొకటే లక్ష్యము. ఇంగ్లీషు వారిదైన పరాయి ప్రభుత్వముగాక, భారతీయులదైన జాతీయ ప్రభుత్వ మేర్పడుట. అంతేగాని తర్కోపతర్కముల వలన క్రమశః ఈ పరిపాలనా యంత్రమునే యేదో సంస్కారము చేసి, చెడ్డ దానిని మంచి దానినిగా, నలుపును తెలుపుగా చేయ బూనుట కాదు— పరతంత్రమైన దేశము క్రమాభివృద్ధి చేత స్వతంత్రసిద్ధి గాంచదు. స్వాతంత్ర్య సిద్ధిచేత సత్వరాభివృద్ధి గాంచును. స్వాతంత్ర్య సిద్ధికి మార్గము జాతీయ భావమును రెచ్చగొట్టుట. ఆ మహావేశము వలన సంకల్ప బలము చేకూర్చుట, ఆసంకల్ప బలమువలన నెట్టికష్టము లనైన సహింపగల ధైర్య స్థైర్యములను ప్రజాసామాన్యమునకు అలవడ జేయుట. వీనిని గ్రహించియే తిలక్ రాజకీయ నాయకుడుగా ధర్మము నిర్వర్తించినాడు.

అందువలననే రాజకీయములందు తిలక్ ప్రథమ దశయంతయు మహారాష్ట్రమున జాతీయోద్రేకమును ప్రజ్వలింప జేయుటతో గడచిపోయినది. అందువలననే, స్వదేశీ ఆందోళన బయలుదేరి భారత దేశమందంతటను ఈ జాతీయోద్రేకమును పెంపుసేయు నవ

కాశము లభించి నపుడు వారు ముందుకువచ్చి నిలబడిరి. వారి సౌశీల్యము సహనము త్యాగము దేశమెఱిగి యున్నదిగాన ఈ నూతనోద్యమమునకు వారిని నాయకునిగా వరించినది. బెంగాలులో పుట్టిన ఆందోళనం బట్టి, కార్యమార్గములుగా నాలుగింటిని — స్వరాజ్యము, స్వదేశ వస్త్వభిమానము, జాతీయవిద్య, పరవస్తు బహిష్కారము అనువానిని — తిలక్‌గారు గట్టిగా చేపట్టిరి. వీనిని దేశీయ కార్యక్రమముగా నేర్పరించిరి. అనుత్సాహముతో సావకాశముగా నిస్సారమైన తీర్మానములు చేసికొనుట కలవాటుపడియుండిన కాంగ్రెస్ మహాసభ కలకత్తాలో సమావేశమైనపుడు పై కార్యక్రమమును ఆ సభసైతము ఆమోదించి తీర్మానించునట్లు తిలక్‌గారు చేయగలిగిరి. దీనితో కాంగ్రెస్‌నందు కలిగిన కలవరము మనమందర మెఱిగినదే. తాళేలునడక నడచుచున్న కాంగ్రెస్‌ను ఊపి విడిచినగాని, దానికి వలసిన చైతన్యము గలుగదని తిలక్‌గారికి తెలియును. కాంగ్రెస్‌సంస్థ జాతీయోద్యమముగా మారుట, కిది మొదటిమెట్టు.

స్వరాజ్యమనుటతో ఒక దృఢలక్ష్యము జాతికి దృష్టము కాగలదు. ఎంతవరకైన, ఏ రూపమున నైన

స్వపరిపాలన యన్నది తక్కినమార్పుల నన్నింటిని లో గట్టుకొనును. ఎక్కడనో, ఎప్పుడో అన్నదానికి ఇప్పుడు నడుముకట్టి త్యాగముచేయుటకు జనులు ముందుకురారు. ఆశకు అందుచు, ఇదిగో మహాప్రయత్నము చేసితిమేని సిద్ధింపగల దని నమ్మకము పుట్టించుచు, కనుచూపు మేరలో లక్ష్యము సన్నిహితముగా నుండవలెను. జాతీయ విద్య యనగా వారియుద్దేశ్యములో, యువజనమును జాతీయ భావపూరితులనుగా జేసి, స్వాతంత్ర్యము సత్వరముగా సిద్ధింపనిచో, దానినిసాధించు యోధులుగాను, శీఘ్రమేసిద్ధించినచో దానిని నిర్వహించు స్వతంత్ర పౌర సమాజముగాను తీర్చవలయు ననుట. స్వదేశీ యన్న సూత్రములో జాతీయ సంకల్పము ప్రజల మనస్సులో గట్టిపడి నిత్యాచరణమున నిత్యజీవనమున త్యాగబుద్ధిగా ప్రకాశించుట. పరవస్తు బహిష్కారము అనుటలో, అధికారులకు ప్రజానీకమునకు గల సంఘర్షణకొక రూపమేర్పడి ప్రజలకొక కార్యసాధన లభించుట. తిలక్ కర్మయోగి, కార్యచిత్తుడు. కావున జాతి హృదయము శిక్షపొంది శక్తివంతమగుటకు కష్టములు సహింపగల్గుటకు క్రియారూప ముండ వలెను గాని మంచి భావములు చక్కని ఉపన్యాసములు చాలవని అత డెఱు

గును. తదేకదీక్షతో చతుర్విధమైన పై కార్యక్రమమును నెరవేర్చుటకు కాంగ్రెస్ సంస్థవలన స్థిరమైన ఆమోదముపొంది యుండుట అవసరమని గుర్తించియే తిలక్ పట్టుపట్టి యథాస్థితముగా ఆ కార్యక్రమమును కలకత్తాసభలో కోరియుండిరి.

అయినను, కార్యవాది గావున ముఖ్యసూత్రములకు లోపము లేకుండ, సమయాసమయములం బట్టి పేరు పద్ధతి, ముందు వెనుక, నీటి విషయములలో నితరులతో కలసి మధ్యమార్గమున కొడంబడు వాడు. ౧౯౦౫ మొదలు ౧౯౧౦ వఱకు సాగిన స్వదేశీ ఉద్యమము నాయకులు, — మన కృషి యీ దేశములోనే జరుగవలెను, ఇచ్చట జాతీయ ప్రబోధమేర్పడ వలెను, ఇంగ్లాండులో మనల నెవ్వరు మన్నన చేయరు, భారతీయులందరు నేకగ్రీవముగా స్వాతంత్ర్యమును సంకల్పించి కార్యోన్ముఖులై యున్నారని యేర్పడు వరకు ఇంగ్లాడు చెవికి మనమాట యెక్కదు, — అని ఘోషించుచుండినారు. యుద్ధకాలమున నేర్పడ్డ హోమ్‌రూల్ పార్టీ నాయకులు - ఇంగ్లాండులోనే తీవ్రప్రచారము చేయవలెను, మనలక్ష్యమును కొంత కొంత ఇంగ్లీషు వారు న్యాయమని గుర్తించి యున్నారు, గాని తగినంత

వారికి తెలియజెప్ప వలెను, ఇంగ్లాండులో ఒక రాజకీయ కక్ష మనకు సహాయము చేయుటకు సిద్ధముగా నున్నది, అక్కడ పని ఫలించును అని చెప్పుచున్నారు. ముందటి వారు స్వరాజ్యమే గాని అంతకు తక్కువ పనికిరాదని చాటి యున్నారు. ఇప్పటివారు ప్రజాధికార సూత్రముల గుర్తించినచో, స్వరాజ్యసిద్ధి దరిదాపులో నున్నచో, స్వపరిపాలనము అర్ధాంశమైనను స్వీకరింప నిశ్చయించి యున్నారు. చివరకు విజయమును సాధించుటకు, సత్వరముగా లక్ష్యమును చేరుటకు అనువైన మార్గమునే సమర మందుగాని రాజకీయమందుగాని వివేకియగు నాయకుడు స్వీకరించును. తాత్కాలికముగా లాభించు నట్లు కన్పడి, విజయ భ్రాంతిని గొల్పు పొరపుల ననుసరింపడు. సర్వమో, శూన్యమో దక్క అరగొరలు పనికిరా వనువారు కేవలము ఆదర్శవ్యామోహితులు. అట్టివారు నిరుపయోగులని చెప్పరాదు, కాని తిలక్‌గారి కట్టి వ్యామోహము లేదు. ఏది ముఖ్యమో, దానిని సాధించుటకు సరియైన దారియేదో వానిని నిశ్చయించి దృఢసంకల్పముతో ఆ మార్గమున కృషిసల్పుటయే ఆయన జీవిత పరమార్థము. వక్రమార్గములు గాని ఆకాశమార్గములు గాని వారికి పనికిరావు. వారిది కర్త

యోగి యైన ఋజుమార్గము.

తిలక్ గారి యీ యుపన్యాస సంపుటిలో స్వదేశీ ఉద్యమము హోమ్‌రూల్ ఉద్యమము రెంటికి సంబంధించిన ఉపన్యాసములు, రచనలు గలవు. ఇపుడు దేశమున నున్న రాజకీయ పరిజ్ఞానమునకు, ఉత్సాహమునకు వారే కర్తలు. తిలక్ గారి హృదయము, వారివాణి, వారి కార్యక్రమము ప్రస్ఫుటముగా నిందు గోచరించుచున్నవి. మహావక్తల గుణవిశేషములు తిలక్ గారిలో లేవు. కాని భావపటిమ, శీలమహిమ - వీనివలన తిలక్ గారు మంచివక్తగా రాణించినారు. ఇంగ్లీషులో కన్న మహారాష్ట్రములో వారి వాణి భాసించినది. ప్రజలకు ఉత్తేజము కలిగించు సూటిమాటలు, తగిన ఉదాహరణములు, స్వభాషలో సులభముగా దొర్లుచుండును. ఏ భాషలో చెప్పినను భావధోరణి ఒకటియే, శక్తి యేకమే - ఆయన శుద్ధాత్ముడు, మహామతి. అట్టివారి నోట వెల్వడు మాటలలో వృథాడంబరము లేదు. అనుకొన్నది తిన్నగా శ్రోతల మనస్సులలోనికి దించి వేయును. ఉడు కారకముందే సమ్మెటపోటులవలె వారి మిత భాషణములు ప్రజాహృదయమును సాగకొట్టును. వారి జీవితమును, వారి లక్ష్యములను, వారి కృషిని

మనసునం దుంచుకొని వారి యుపన్యాసములను చదువ వలెను. అందుచేతనే ముఖ్యాంశములను నేను సూచించితిని. అవి ప్రజలకు తెలియనివి గావు. తెలిసియున్నను ముఖ్యమైన సంగతులను పునఃపున: చెప్పుటలో ప్రయోజన మున్నది.

వారి జీవితమును గుణగణములను తలపోసినపుడు రెండు విషయములు, ముఖ్యముగా దేశోపకారకములు, గమనింపదగి యున్నవి. భారత రాజకీయ జీవనమున ఆ రెండును చాలకాలముగా కొరవడి యుండుటయే గాక యిప్పటికిని తగినంత యేర్పడి యుండలేదు. అందువలన దేశమునకు తిలక్ గారి యీ గుణద్వయము ముఖ్యముగా లక్షింపదగినది. మొదటిది కార్యోన్ముఖమైన దృఢసంకల్పము. కోరికకు సంకల్పమునకు చాల యెడ మున్నది. కోరిక, ఉత్సాహము, ఉద్వేగము - వీనివలన కార్యము సిద్ధింపదు. సామాన్యుల మనోరథములు మనస్సునందే మాసిపోవును. లేదా చప్పిడిగా 'నేదో మేమును యీ పస్తాత్రము చేసినాముగదా' యన్న అల్పసంతోషముతో నాగిపోవును. మహనీయుని దృఢసంకల్పము మహామేరువును కదలింపగలదు. తిలక్ గారి రెండవ గుణము త్యాగశక్తి. అచంచలమైన ధైర్యముతో

నెట్టి కష్టమునైనను సహించి ఏమియు జరుగనట్లు ఎప్పటి వలె తన కార్యక్రమమును నిర్వర్తించు శాంతిస్థైర్య ములు, ఆ త్యాగశక్తికి మూలము. ఏదో ఉద్రేకముతో ఏమో చేయుటగాదు త్యాగము. భారతదేశ ప్రముఖ నాయకులలో వారితో సమానముగా బాధలకోర్చిన వారు లేరు. ఆ బాధ లన్నింటిని అంత సహజముగా అంత నిర్లిప్తులుగా సహించినవారు లేనేలేరు.

తిలక్‌గారి జీవితకృషిలో ప్రథమభాగము ఫలించి నది. రెండు సదవకాశములు వారికి సహాయ భూతమై నవి. స్వదేశీ ఆందోళన దేశవ్యాప్తమై, ప్రజాహృదయ మును సారవంతముచేసి దేశలక్ష్యమునకు నామరూప ములు స్థిరముగా నేర్పరచినది. ఆరువదేండ్లు పట్టుపని ఆరేండ్లలో జరిగినది. దీనికి తోడు బిసెంటమ్మగారి అద్భుతప్రచారము రెండవ యవకాశము. ఆమె ప్రతిభ నిరుపమానము, ఉత్సాహము దేదీప్యమానము, శక్తి అవిరామము. ఆమె దేశము యొక్క పరమలక్ష్య మును ఆచరణరంగములోనికి మనోవేగముతో నాకర్షించినది. ఇప్పటి హోమ్‌రూల్ ఉద్యమమునకు ముమ్మూర్తులైన తిలక్, బిసెంట్, గాంధీ గార్ల అధ్వ ర్యము విజయ సూచకము.

తిలక్ గారి జీవితాశయమును దేశీయు లందరు దేశాశయముగా గ్రహించినారు. ఏ తత్ సిద్ధియే తమ యుద్యమమున కేక లక్ష్యముగా కార్యోన్ముఖులైనారు. భారత దేశ పరిపాలనాభివృద్ధికి అవధి ప్రజాపాలన మని ఇంగ్లీషు దేశము, ఇండియా ప్రభుత్వము అంగీకరించినవి. ఇంగ్లాండులో ముస్ముందు అధికారమును చూరగొనగల ఒక రాజకీయకక్ష భారత స్వరాజ్యసిద్ధి నామోదించినది. ఈ దేశములో కొద్దిమంది మాత్రము ఇప్పటికి రాగల స్వల్పలాభముల నాకాంక్షించుచు తక్కిన దెల్ల దూర లక్ష్యముగా, ఎప్పటికో, ఏమో అన్నదృష్టితో నున్నారు. వారు పోగా అన్నిరాష్ట్రములందు, అన్ని కులములందు సమస్త జనము స్వరాజ్యము సన్నిహితాశయముగా స్వీకరించినారు. తిలక్ గారి ముఖ్యసూత్రములు అంగీకృత మైనవి. మొదట ఎంతో శ్రమించిగాని వారు దేశము నకు నచ్చజెప్పలేని వైన మహాశయములు ఇప్పుడు సర్వసాధారణము లన్న దశలోనికి వచ్చినవి. ఎంత త్వొందరలో నిక దేశాశయము ఫలించు నన్నదే మిగులు. శేషించిన ఆ యాశతో తిలక్ అఖిలభారత నాయక మణియై దీపించు చున్నాడు. అది నెరవేరుటతో తిలక్ జీవితము పూర్తిగా ఫలప్రద మగును. అంతవఱకు వారికి

విరామము లేదు. ఒడలిలో ప్రాణమున్నవఱకు వారి సర్వ శక్తులు అందుకే వినియుక్త మగుచుండును. వయస్సు పైకొన్నది. పాటవము సడలుచున్నది. కాని అంతస్సు ముదియ జాలదు. నదీప్రవాహము సాగరము చేరువఱకు ఎన్నిపాయలైనను, ఎంత కృశించినను ఆగిపోనేరదు. భారతదేశము విశ్వమున కుపకారిగా, స్వతంత్రగా, పునర్వికాసిగా నేర్పడు సుముహూర్తము అత్యంతము చేరువనే యున్నదో, ఇంకను కొంత విలంబ మున్నదో యెఱుగము. కాని సిద్ధి నిశ్చయము. భారతదేశ నిర్మాతగా తిలక్‌గారి స్థానమును సునిశ్చితము. క్లిష్ట కాలములో భారతదేశమునకు ఉద్ధారకులైన అయిదారుగురు మహాపురుషులలో బాలగంగాధరతిలక్ అనుత్తముడు. భారతీయులకు గర్వకారణము. కలకాలము వారినామము స్మరణీయము. *

౧౯౧౮

* తిలక్‌గారి 'రచనలు, ఉపన్యాసములు' అను గ్రంథమునకు శ్రీ అరవిందులు రచించిన ఉపోద్ఘాతము.

# స్వామి దయానంద్

నేటి భారత పునర్వికాసమును భావి ప్రజానీకము తలపోయునపుడు, తత్కర్తలుగా వారికి తోచు మహాపురుషులలో ఒక మహనీయుడు ప్రత్యేకముగా ప్రకాశింపగలడు. అతని శ్రేణి ప్రత్యేకమైనది. అతని కార్యధోరణి అనన్యమైనది. శిఖరముల పొడవు లింత లంతలై, తరుగుల్మ లతాపరిశోభితమై, దర్శనీయమైన యొకానొక పర్వతపంక్తిలో పెద్దతడవు నడిచినంతట, ప్రత్యేకముగా వేఱుపడి పటిష్ఠమై, పార్శ్వముల నిరాచ్ఛాదితమై, కేవలము కొమ్మకొన నొక్కచెట్టు చద లంటనై సారోదకంబులు కోనలోనికి గ్రుమ్మరించు నిర్ఝరంబులతోటి శుభ్రవర్ణమైన నిట్రాతికొండ యొకటి కంటి కగపడినట్లు ఆ మహనీయమూర్తి నా మనస్సునకు గోచరించుచున్నాడు. ఆయనయే దయానందస్వామి. నవ జీవనదాత, పునర్నిర్మాతయైన యీ తేజస్వి జన్మస్థానము కథియవాడ. ఆ సీమ విలక్షణములు నిసర్గ గుణములు

అతనిలో అంతర్భూతమైనవి. అచటి గిర్నారు కొండల నిండారు దండితనము, అచటి తీరభూములపై నుర్వ్యగ్రక్కు పశ్చిమాంబుధి ఘోషణగాంభీర్యము, అచటి జనముల శారీర మనస్స్వాస్థ్యము, శుభ్రలక్షణమై ఆదిశక్తిసంపన్నమై తీర్చినచో అత్యుత్తమముగా తీరున దైన వారిప్రకృతి — యివన్నియు కొంత కొంత ఆ మహానుభావు నావేశించి యున్నవి.

ఇతని స్వరూప స్వభావములను నేను నిర్వర్ణించు కొనునపుడు, తత్తుల్యులైన సమకాలిక పురుషులనుండి వీరిని వేఱుపఱచు గొప్పలక్షణములు రెండు మున్ముందు స్ఫురించుచున్నవి. నేటి భారతమునకు కర్తలైన మహా పురుషులు తమ అంతస్సును జాతిమనస్తత్వముతో సమ్మిళితముగావించి యేకీభూతమైనారు. భావి కాలమున రూపనామములతో జన్మదాల్చ వలసియున్నదై యిప్పుడు అర్ధ్రము అపరిస్ఫుటమునై యున్న జాతి తత్త్వముతో తాము అధ్యాత్మిక సమీకరణ మొంది నారు. లోలోపల జాతికి ఒక కదలికను, ఒక పొంగును గలిగించు నిగూఢశక్తిగా వారు విలీనమైనారు. భరతాత్తలో వారు మహనీయులుగా మహాత్మ్యాకారులుగా చిరంజీవులైనారు. వారు మనలోనే యున్నారు. వారు

లేనిదే మన మిప్పుడున్నట్లుండు వారము గాము. కాని వారిలో నే యొక్కరింగూర్చిగూడ, 'అతడుని ర్దేశించినది ఇది, అతని తత్త్వమిందులో రూపుదాల్చినది' అని మనము చెప్పజాలము.

ఈ శ్రేణికి మేలుబంతి మహాదేవ గోవింద రెనడే. అతివిస్తృతి బహువ్యాప్తి గల జీవ పరిణామదశలో ఇట్టివారవసరము. ఆర్థికవేత్త, సంస్కర్త, దేశారాధకుడు నైన యీ మహారాష్ట్రుని మన మింతగా గొనియాడుటకు 'ఇతడు చేసిన ఘన కార్యమేమి' అని పరదేశీయుఁడెవడైన ప్రశ్నవేసినచో ప్రత్యుత్తర మిచ్చుట కొంత కష్టమే. వారి శక్తిచే నుద్బోధితులై వారి భావముచే నుజ్జీవితులై నవభారతమును సేవించుచున్న పలువురు సుప్రసిద్ధ నాయకులను మనము చూపి, 'యిది రెనడే చేసిన మహోపకారము' అనవలసి యుండును. ఉపరి, యిట్లనుగ వలసియుండును – 'రెనడే లేకున్నచో మహారాష్ట్రము ఈరూపున నుండునా? మహారాష్ట్రము వినా భారతదేశము ఎట్లుండి యుండును' అని. రెనడే కన్న పరిస్ఫుటముగా తమప్రభావమును కార్యధోరణిలో వెలార్చిన వారింగూర్చి గూడ ప్రధానముగా నాకు ఈ భావనయే రూఢమై యున్నది.

వివేకానందుని చూడుడు. ఆత్మశక్తి మూర్తీభవించిన వాడు, మానవ మండలిలో సింహము వంటివాడు. కాని అతనిదిగా మనకు మిగిలియున్న కార్యసిద్ధి అతని శక్తి సామర్థ్యములకు చాలినంతది గాదు. ఇప్పటికిని అతని ప్రభావము పనిచేయుచునే యున్నది. ఎట్లో, ఎటనో, మన మెఱుగకయే, విస్తారముగా, విచిత్రముగా, లోలోపల భరతాత్మలోనుబుకు నొకవెల్లిగా నది కదల బాఱుచునేయున్నది. 'ఇదిగో వివేకానందుడు దేశమాత హృదయమం దున్నాడు. తత్సంతానము, నంతయు నావేశించియే యున్నాడు' అని మనము అనుకొనగల్గుచున్నాము. ఆ మహాపురుషులందఱు అట్టివారే. వారు తమ కార్యకలాపమునకన్న కడునధికులు. వారి ప్రభావము ఆకారరహితమై అతిశయ వ్యాప్తిగలదై యున్నది. కావున తత్సంబంధమైన కార్యరూపములో నది నిర్బంధింపబడియున్నది గాదు.

దయానందుని మార్గ మట్టిదిగాదు. అనిర్దిష్టమైన వస్తుతత్త్వములో విని గూఢముగా నతడు లీనమైన వాడుగాడు. తన మూర్తిని తాను కంచుపోత పోసినట్లు జనములందును, సంస్థలందును స్పష్టముగా ముద్రించుకొన్నాడు. ఆతని కార్యజాలము సర్వము ఆతని యాథార్థ్య

త్మిక శరీరమునకు కన్న సంతానము. వానికి రూప నామము లున్నవి. శక్తి దార్ఢ్యత లున్నవి. జీవోపేతము లైనవి. తత్కర్తవలెనే రూపు గొనియున్నవి. తానేపని తీర్చుట కవతరించినది స్పష్టముగా నెఱిగినవా డతడు. దానిని తదేక దీక్షతో నిర్వర్తించిన వాడతడు.

దివ్యదృష్టితో నాతడు వలయు వస్తువులను కూర్చుకొని, విధుల నేర్పరించుకొని, జన్మ సిద్ధమైన కర్మ కౌశలముతో కృషిచేసి కార్యసిద్ధి బడసిన వాడు. భగవంతుని కర్మాగారమున కార్యారంభుడైన యాశక్తి మంతుని గూర్చి తలపోసినపు డెల్ల— పోరాటము, పరిశ్రమము, విక్రమము, విజయము- యివియే మనస్సున చిత్ర పరంపరగా నిండుకొనును. భగవత్సృష్టిలో నితడొక యోధాగ్రేసరుడు, దివ్యతేజస్సును విస్తరింపజేయు వీరపురుషుడు, మానవులను సంస్థలను చక్కదిద్దు శిల్పాగ్రణి, ఆధ్యాత్మికమార్గమున నడ్డువచ్చు భూతికాంత రాయము లన్నిటి నతిక్రమించు మహాజేత - అని ఆ మహనీయుని గూర్చి అనుకొనుచుందును. ఆధ్యాత్మిక కార్యకౌశలమిట్లు మూర్తీభవించె ననితోచును. పరస్పర విరుద్ధములుగా సామాన్యదృష్టికి తోచునవి - ఆధ్యాత్మికత, కార్యకుశలత - యివిరెండును ఏకమగుట యేదో

అదే దయానందస్వరూపము.

ఆయన కార్యరూప మట్లుండగా ఈ తత్త్వముతో ఈ లక్ష్యముతో నతడు పరిశ్రమించుట చేతనే భారత నిర్మాతలలో నాతనికి ప్రత్యేకస్థానము స్థిరపడినది. జాతి గుణమునకు ప్రాశస్త్యమైన ఆర్య లక్షణము నొకదానిని మరల చేకూర్చినవా డతడు – అతని విశిష్టతలో రెండవ యంశ మీ ఆర్య విలక్షణత. ఇదియే తొలి దానికిని మూలాధారము. మనము నిర్దిష్ట లక్షణములతో స్థిర స్వరూపముతో జీవించు వారము కాము. బహుళ భావ ప్రవాహములో తేలిపోవుచుందుము. ఆ భావ బాహుళ్యము మనలో చేరి మన మనశ్శకలములకు శతధా రూప మిచ్చుచుండును. ఒక విధమైన కార్యారంభము తత్ఫలితముగా జరుగుచుండును. కాని అంతస్సంతయు మారదు, చేయు కార్యము అంతస్సున కంతకు జెందదు. అంతస్సులో కదుపు గట్టుని దంతయు మరల భావ ప్రవాహములో కొట్టుకొని పోవుచుండును. మన జీవన ప్రకారములు అవినిశ్చితములు. సందర్భానుసారముగా వ్యాకోచ సంకోచములతో సాగిపోవుచుందును. ఇదిగో నిబ్బరముతో నెదు రీదుచున్నామని యుబ్బునపుడును నిజముగా స్థిరబుద్ధులముగాక నిమిత్త

ప్రయోజన పరులమే యగుచున్నాము. దయానందుడు తన్ను జొచ్చిన భావవాహిని నంతయు తాను గ్రహించి, తనలోనే యిముడ్చుకొని, ధర్మముగా తనకు దృష్టమైన రీతిని, దానికి తనలో రూపమేర్పరచి స్వోద్దిష్టమైన ధర్మరూపములందు బహిః ప్రపంచమున వెల్వరింపజేసి నాడు. ఆతని యత్యుద్ధతిగా తోచునదెల్ల తత్స్వరూప నిర్ణయ సారమేగాని వేఱుగాదు.

ప్రకృతికి హస్తంగతుడగుటగాక ప్రకృతిని హస్తగత మొనర్చుకొని సృష్టికార్యము నిర్వహింప గల యధికారము తనకున్నదని ఋజువుచేసికొన్నాడు. పురుషకారము కార్యధోరణి చాలినంతలేని మనల నిప్పటికిని అతనియాత్మ ఇట్లుద్బోధించుచునే యున్నది: 'భరతపుత్రా, అపర్యాప్తముగా నుండిపోవుట, అవినిశ్చితముగా నెదుగుచుండుట, వీనితో తనివొందకు, నీ వెట్టివాడవై యుండవలెనని భగవదిచ్ఛయో గ్రహింపుము. భగవత్ప్రబోధము ననుసరించి నీ వేమిగా వృద్ధిపొందవలయునో నిర్ణయింపుము. నిర్ణయించి, మఱి దానిని నీలో నీవు చెక్కి సాధింపుము. సృష్టిలో చెక్కి సాధింపుము. అంత ర్ముఖుడవే కాక బహిర్ముఖుడవు కమ్ము. కేవలాత్మవే గాదు జీవధారివి నీవు. భగవంతుని

సేవింపుము. ప్రకృతిచే సేవగొనుము' — ఈ యుద్బోధ కాతడే లక్ష్యభూతము. అతని కంతస్సులో దైవము, కన్నులలో దివ్యదర్శనము, చేతులలో మహాశక్తి - తాను దృష్టించినరీతిని జీవరాశిని చెండి చెక్కి తీర్చ గలశక్తి - సమగ్రముగా నుండెను. కొండ బండల చెండి మూర్తులు తీర్చినట్లు కొండ వంటి యా దండి మానవుడు వస్తురూప కల్పనముగావించినాడు.

దయానందస్వామి జీవితములో ప్రతి ఘట్టమునకు ఆతని ఆధ్యాత్మిక కార్యావేశము మిన్నంటియుండును. అప్రయత్నోపలబ్ధములైన శక్తినిశ్చయము లాతని సర్వ కార్యములపై నచ్చుగుద్దినట్లు వెలయుచున్నవి. భారత జాతి పునర్జన్న కాతడు బీజగ్రహణ మెట గావించెనో చూడుడు. భారతజాతి జన్మారంభ వేళ వికసిల్లిన పద్మకోశము భారత ధర్మ మూలాధారము నై వృ చక్కగా దృష్టిబఱపినాడు. ఇది యేమి దివ్యదృష్టి! ఎంతటి ధీ సాహసము! వేదము నతడు చేపట్టినాడు. అజ్ఞాన విలసితమైన వ్యాఖ్యానాదులచే రూపముచెడి, అనుద్బుద్ధుల యపోహలతో ఆదిమవాసుల వాగ్ధోరణిగా న్యూన మొనరింప బడియున్న వేదమాతృక యొక్క యథార్థ మూల్యమును గ్రహించి, ఈ జాతిని, ఈ దేశ

మును తీర్చిన మన పూర్వర్షుల శక్తి మహిమల పర మాలయముగా, దివ్యజ్ఞానము దివ్యారాధనము దివ్యా చరణము నిరూపించు పరమ గ్రంథముగా, నాతడు మనకు ప్రకాశ మొనరించినాడు. దయానందులు స్వ తంత్రించి వ్రాసిన వేదభాష్యము సరి యని అందఱు నంగీకరింతురో లేదో నే నెఱుగను. అగాధము పర మాద్భుతము నైన వేదము యొక్క అర్థరీతులు కొన్ని కొన్ని వేఱుమార్గముల నిరూపించు ప్రయత్నముల కవ కాశము కలదనియే నాయభిప్రాయము. కాని అదంత ముఖ్యముగాదు. దయానందుడు వేదమును స్వీకరించుట యన్నదే ముఖ్యము. వేద మనగా భరతభూమికి కుల పర్వతము. దానిని చేపట్టి దాని నాధారముచేసి జాతి విద్య, జాతి పౌరుషము, జాతి తత్త్వము నిర్మింపబూనుట యన్నదే ముఖ్యము.

రామ మోహనరాయలు బంగాళమును ఊగించి నాడు. నదీతీరమున కేదారోప్రాంతమున ఆదగొని మైమఱ చిన వంగజాతిని లేవగొట్టినాడు. కాని అతడు ఉపనిషత్తు లతో ఆగినాడు. దయానందుడు అంతటితో నిలువక మనజాతికి మూలబీజమైన వేదమునే లక్షించినాడు. జాతిహృదయ మతనిలో స్పందించినది. దాని నతడు

తేజోవంతము చేసినాడు. కావుననే అతని నిర్మాణము లెంత సంప్రదాయాతిక్రమణ చేసినను వస్తుతః జాతీయములే యై యున్నవి.

జాతీయమైన మనుగడ యనగా ప్రాన్పడి నిలిచి యుండుట గాదు. శక్తి సహితమైన ప్రాచీనవస్తువు నొక దానిని చేపట్టి నేటి జీవిత వాహినిలోనికి దానిని విసరి నప్పుడే నూతన నిర్మాణమునకు వలయు కదలిక, చైతన్యము పుట్టును. పూర్వయుగశక్తితో ఈ కాలపు కరువున కాతడు ప్రాణము వోసినాడు. ఆదికాలసిద్ధమై మూలవస్తువునకు చేరువై, తొలియుబుకు సంగల యుత్సాహము, కల్మిమై సనాతనమైన దేది గలదో అదియే జాతియొక్క పునరుజ్జీవనమున కాధారము కాగలదు.

దయానందుని జీవితమునందును, చేతలందును అస్పష్టత, అనుమానము, అన్వేషము నన్నవి యుండవు. అతనికిగల నిర్మలపరిజ్ఞానము, ఆర్జవము, త్రికరణశుద్ధి — వీనివలన నన్నికార్యములు వానియంతటనవి స్పష్ట రూపములతో నేర్పడిపోవును. విస్పష్టమైన మనోనిర్ణయము, పరిపూర్ణమైన సత్యపాలనము, స్వపరనిర్వంచనము, విధివస్తునిర్ణయమున నిష్పక్షపాతము — ఇవి

దుర్బల తత్త్వులైన మానవులలో లభించు టరిది. ఆర్య మతానుయాయి విజయమునకు, పై లక్షణములే కీలకము. గుమ్మము చేరి ధైర్యవిశ్వాసములతో స్పష్టముగా తలుపుగొట్టు వానికి ప్రకృతి తప్పక వెంటనే గడియతీసి ప్రవేశ మిచ్చును. గురువుగారి యీ గొప్పగుణము తచ్ఛిష్యుల నావేశించి యుండుట సంతోషింపదగినది. ఒకపని న్యాయమని, అవసరమని తోచినపుడు, జంకు గొంకు లేక ఆపని నెఱవేర్చుటకు నడుముకట్టిన సంఘ మొకటి యీ దేశమున నిపు డేర్పడియున్న దనుటతో తప్పక ఆపని నెఱవేఱగల దనుప్రత్యయము మనకందఱ కును కలుగగలదు.

ఋతము అతి సులభముగా గన్పించును. కాని అత్యంత కష్టసాధ్యము. వేదబోధకు మంత్ర వాక్య సత్యము అనునది. మనోవాక్కాయములందు ఋత పాలనమే పరమార్థము. ఆర్యుల నీతి తత్త్వమునకు ప్రధానము త్రికరణశుద్ధి. అంతస్సున ప్రసన్నత, వాక్కర్మల నవిభిన్నత - ఇదియే ఆర్జవము. ఆర్యుల కిది మూలగుణము. పరిశుద్ధసత్త్వమునకు ఆర్జవమే మూలాధారము. మానవుడు ప్రకృతికోశమునకు దూరగతుడు కాలేదనుటకు తార్కాణము. అదియే దివస్పుత్త్రిని

దివ్యలక్షణము. దయానందస్వామి యొనర్చిన సర్వకార్యములందును, అతడు స్థాపించిన సర్వసంస్థలందును ఈ లక్షణము ముద్రితమైయున్నది. ఆర్జవగుణమును బట్టియే దేనిని గాని యిది దయానందుని చేసేతయని గుర్తింపంగలము. మన కందఱకు ముఖ్యముగా నిక్కాలమున వలసియున్న వైన శుద్ధసత్త్వము, సుప్రసన్నత, దూరదృష్టి, కర్మకౌశలము, ధర్మవీరత – ఈ గుణములు మరల మనయందు ప్రకాశించునట్లు భారతదేశమున దయానందుని తత్త్వము అపరిచ్ఛిన్నముగా నలరారుగాత. *

* 'వేదిక్ మాగజీన్' ౧౯౧౫.

# దయానందుల వేదార్థము.

II

దయానందస్వామికి వేదము కులపర్వతము. వారి భావ ప్రపంచకమునకు అది పునాది. అంతర్జీవమునకు విధి నిర్ణేత. బహిర్జీవమునకు కర్తాధారము. ఇంతియ కాదు. సనాతనమైన బ్రహ్మవాక్కు. ఐహికాముష్మిక పరిజ్ఞాన నిలయము. ఆది మధ్యాంత రహితమైన ఇట్టి యీ వేదమును కొందఱు కొఱమాలిన దనియు, ఆది కాలమందలి అజ్ఞానుల మంత్రతంత్ర మనియు, ప్రకృతి రూపముల సమారాధనమనియు, పశుప్రాయులైన మానవులు స్వర్గమో, అన్నమో, పశుగణమో, శత్రు నాశమో, వ్యాధి వారణమో, భోగమో, భాగ్యమో, కోరి కావించిన ప్రార్థనాదిక తంత్రజాల మనియు, నిరాదరపాత్రము గావించినారు. మఱి శాయన భాష్యానుయాయులైన ఆచారపరులును మంత్ర తంత్రములన్న న్యాన వాదమునే గ్రహించుచు, అయినను పరమార్థ గ్రంథమని ప్రమాణీకరించు కొను చున్నారు.

వేద స్వరూపమేమి ? అన్నది కేవలమొక పండిత వాదము గాదు. దయానందుల కృషి నవగాహన చేసికొనుటకే గాక భరతదేశముయొక్క గతము నర్థము చేసికొనుటకు, భవిష్యత్తును రూపించుటకు అత్యావసరము. గతమున వర్తమానమున నొకదేశ మెట్టిదో దానినిబట్టియే ఆదేశముయొక్క భవిష్యత్తు యేర్పడును. ఒక్కొక కాలమున సింహావలోకనము చేసి జాతి స్వరూప నిర్ణయము గావించు కొనును. గతము ననుసరించి వచ్చినదానిని, ప్రకృతమున సంక్రమించుచున్న దానిని, సర్వవిధముల పరీక్షించి, ఉత్తరోత్తరాభి వృద్ధికి ఉపకరించు ద్రవ్యమును మాత్రము యేఱుకొని నిలుపుకొనును. ఇక్కాల మట్టి పరీక్షవేళ. దయానందుడు అట్టి పరీక్షకులలో నొకడు. పెద్దలనాటి భాండారమునందెల్ల అతి పవిత్రమైనది వేదము. ప్రత్యక్షముగనో, పరోక్షముగనో వేదము మనకు ప్రమాణమై యున్నది. వేదార్థము తెలియరాక పోయినను, పౌరాణిక సాంప్రదాయములు బలిసిపోయినను, సకల ప్రమాణములకు వేదము మూలాధారముగా నీ జాతి అంగీకరించి నడచుకొను చున్నది.

వైదిక సాంప్రదాయమున మొదటి నుండియు

ద్వంద్వార్థ మున్నది. ఒకవంక మంత్ర తంత్ర కోశమని, మఱొకవంక విజ్ఞాన కోశమని. బ్రాహ్మణములు తొలి సంప్రదాయమునకు, ఉపనిషత్తులు మలి సంప్రదాయమునకు చెందినవి. వెనుక వెనుక విద్వాంసులు వేదమును యజ్ఞ యాగాది కర్తలకు ఉపయోగించు కొనుచు పరార్థ చింతన కితరత్ర విచారింప జొచ్చిరి. కాని జాతిహృదయము ఆ యున్నత సాంప్రదాయమునే గమనించి, వేదమును పరమోపదేశముగా పూజించుచునే వచ్చినది. మూఢారాధన పాత్రమై మూలనున్న వేదము మన యీ కాలమున రంగమునకు రాగానే, ఏతన్నిరూపణమున తిరిగి వైవిధ్య మేర్పడినది. ప్రకృతి దేవతల యనుగ్రహ సంపాదనార్థమైన మంత్ర తంత్రాదికమే వేదమని పశ్చిమ విపశ్చినులు సిద్ధాంతము చేయబూనిరి. కాని దయానందస్వామి దృష్టితో భరతజాతి మరల ఆ వేదమును అవలోకించి, కొన్ని శతాబ్దములబడి పేరుకొన్న భ్రమను తొలగద్రోచికొని, వేదము సనాతనమైన పరమోపదేశమని, మానవకోటికి దైవ మనుగ్రహించిన పరమ సత్యమని, గ్రహించినది. వేద స్వరూపము మనకు మనము నిశ్చయించుకొనక తప్పదు. మడిచుట్ట చుట్టి వేదమును పూజించు కొందమనుట వలను పడదు.

అటు శాయనులదారి బట్టినచో, వేదము మంత్ర తంత్ర కలాపము, చిత్ర విచిత్ర గాథాదికము నని యొప్పుకొని, నేటి కాలమున బుద్ధిమంతులకు ప్రయోజనకారి కాదను కొనవలెను. పాశ్చాత్యపండితుల పోబడి ననుసరించినచో వేదము శైశవదశలో మానవజాతి తెలిసి తెలియక చేసిన సమారాధన మనవలెను. ఈ రెండును తీసివేసి నచో వేదము దివ్యజ్ఞానము ప్రసాదించు పరమ గ్రంథ ముగా మనము స్వీకరించ వలెను. అప్పుడే వేదోపదేశ మేమని మనము విచారించి వినుకొందుము.

దయానందులు వేదమునకు చెప్పిన యర్థము సహజసిద్ధము కాదని భాషా బలాత్కారమని, చమత్కార సిద్ధమని ఆక్షేపము గలదు. వారి అరయిక పోబడి విప రీతమని అనాదరణీయ మనియు ఆక్షేపము గలదు. దైవమే వేదమును ప్రవచించినదను వారి సూత్రము మూఢభ్రాంతి యనిగూడ ఆక్షేపము గలదు. ఈ ఆక్షే పముల సామంజస్యమును నేనిట వితర్కింపను. దయా నందుల వేదార్థముంగూర్చి భావికాలమున నేమి సిద్ధాంతము సేయుదురో నేనూహింప దొరకొనను. వేదమునుగూర్చి దయానందుల మూలభావముల మాత్రము స్పృశించెదను. ఒక మహనీయుని మనః

కర్తల మన మాలోచించు నప్పుడు, దేనికిని వారిచ్చిన నామ రూపములుగాదు ప్రధానము. కర్మాచరణమున వారొసంగిన సహాయకశక్తి, భావప్రపంచమున వారొసంగిన - లేదా - పునరుద్ధరించిన — దివ్యస్ఫూర్తి యివి ముఖ్యమైనవి.

మఱి దయానందుడు శబ్దములను తలక్రిందుచేసి విపరీతార్థములు నిర్వచించెనని ఆక్షేపించు చున్నారే యెవరువారు? శాయన భాష్యమును శిరస్సున బెట్టుకొను వారట్టి యాక్షేపము చేయుటలో సబబు కలదా! శాయానాచార్యుల వేదభాష్యము పరిశ్రమించి వ్రాసినది, పాండిత మండితమైనది, వస్తుపరిచితి కుపయుక్తమైనది. కాని తాను కోరినయర్థమును తన సిద్ధాంతమున కనువుగా నిరంకుశ పాండితీ విశేషముచేత శబ్దమును బలాత్కరించి సాధించుట యందింతటి మహాగ్రంథము వేఱులేదు. అసామాన్యపాండితి అనుభవ విరుద్ధములైన యర్థముల నిచ్చుటకు వెనుదీయదు. సత్యదృష్టి నతిక్రమించి సువిమర్శ కెడదప్పి పాండిత్యము పరిఢవిల్లుట లోకములో కలిగి యున్నదే. మఱి పాశ్చాత్యపండితుల యీావలి కృషి చేసిన సిద్ధాంతములే కడమాటగా గ్రహించువారు సైతము దయానందుని ఆక్షేపించుట

పాడిగాదు. వైదిక వాఙ్మయమును నూరేండ్లుగా పాశ్చాత్య విద్వాంసులు చాల శ్రమించి పరిశోధించి సద్భావముతో వ్యాఖ్యాదికము వ్రాసియున్నారు. కాని వారి సిద్ధాంతములు గాలిమేడలు. కించిత్తు ఆధారముతో, ఊహాపోహలతో, ప్రత్యక్ష ప్రమాణ నిరాదరముతో, బలవన్నిదర్శన నిరపేక్షముగా నా విద్వాంసులు విపరీత సిద్ధాంతములను గావించి యున్నారు.

వేదార్థమున వివాద గ్రస్తమైన ముఖ్యాంశమేమి? వేదప్రోక్తమైన మతమేమి— అను దానింబట్టియే వేదార్థ మేర్పడవలసి యున్నది. అట్టి మతమునకు వేద వాక్యమే ప్రమాణము. వేదమతమేమి– అను విషయమున దయానందులు ఘంటాపథముగా ఘోషించినది; వేద మంత్రము లన్నియు ఏకోద్దిష్టములైనవి; వివిధనామములును ఏక దైవమునే సంబోధించునవి: వేఱు వేఱు దేవతల నుద్దేసించినవి గావు; గుణములు అనేకములైనను దైవము ఏకమే. ఇది వారి మూలభావము. ఇది వారి క్రొత్తకల్పనగాదు. ఊహాగానము కాదు. వేద వాక్యమే స్పష్టముగా కలదు; ఇంద్రుడు, అగ్ని, యముడు, మాతరిశ్వుడు, మున్నుగా వివిధ నామములతో, ఋషులు పేర్కొను సద్వస్తు వొక్కటే.

ఇట్టి ప్రమాణముండగా వేదమతము బహుదేవతాకమనువాదము చెల్లునా? మాక్సుముల్లరు, రాత్ గార్లకన్నను వేదజ్ఞులకు గదా వేదమతము తెలియును.

ఆధునిక పండితులు ఇట్టి ప్రమాణములను త్రోసిపుచ్చుటకు యుక్తివాదము నవలంబించిరి. ఈ మంత్రము ఆదిలో నుండియుండదని, తరువాత తరువాత ఆర్యులకు తోచియుండునని, వారికన్న నెఱుకువగలవారైన ద్రావిడ జాతులనుండి గ్రహించి యుండవలెనని—యీవిధముగా సమర్థకములు అల్లనారంభించిరి; కాని యిదెల్ల నిష్ప్రయోజనము. వేదములందు ఒక్కచోట గాదు, బహువారముగా దైవము ఏకమను ఉపదేశమే గలదు. అగ్ని, ఇంద్రుడు, మున్నగా దేవోద్దిష్టమైన మంత్రములందంతట దేవతలందఱు అభిన్నమను సూక్తులు గలవు. అగ్నింగూర్చి చెప్పిన పేరులు విశేషణములు మరుత్తుంగూర్చి గాని, ఇంద్రుంగూర్చి గాని చెప్పఁబడుటగలదు. అందఱు దేవతలు నీవే అను సంబోధనలు గలవు. పరదైవ సంజ్ఞాదికము ప్రతి దేవతకు నన్వయింపబడియున్నది.. ఇట్లున్నను, మంత్రకృత్తులైన ఋషులకు ఇంద్రాగ్ని యమవరుణులు పరబ్రహ్మమని తెలియదని, యీ దేవత లందఱిని వేర్వేఱుగా ఋషులు భావించి

సంస్తుతించిరని, అతిశయ సంబోధనలు ఆ చిల్లర దేవతల నుబ్బించి మెప్పు పొందుట కాడిన మాటలని వ్యాఖ్యానించుట కేవలము ఆభాసము. వైదిక మతము ఏకదైవ నిరూపకమని గ్రహించుట ఋజుమార్గము, సహజ మార్గము. ప్రకృత్యంగములను వివిధ దేవతలుగా నిరూపించిన దనుట బుద్ధి వైపరీత్యము. పాశ్చాత్యపండితులు వేదార్థమును సహజ మార్గమున గ్రహింపక పోవుటలో నొకరహస్య మున్నది. అట్లు గ్రహించినచో వైదికార్యులు సమగ్రమత దక్షులని యేర్పడును. మానవ జాతి శైశవావస్థలో నున్నపుడు, పరమ సత్యముల నెఱుంగ జాలక భౌతికవస్తుజాలమును బహుదేవతలుగా నీ ఋషులు భావించి ఆరాధించి రన్నదేగాని పరిణామ వాదమునకు బలము చేకూరదు. అందుకొఱకు వేదార్థమును వారు వికల్పము గావించుట యైనది. సత్యమును చాటుమఱుగున కొత్తుట యైనది. పశ్చిమ పండితుల చేత ఇది. విపరీత వ్యాఖ్యానము వారిదా ? దయానందులదా ?

వేదోక్తమైన దైవము ఏకము అని దయానందులు చేసిన ముఖ్యసిద్ధాంతమును మనము గ్రహించినచో, వేదమంత్రములందు అగ్నినిగాని, ఇంద్రునిగాని మఱి యే దేవతనుగాని యేఋషి సంబోధించినను పరమదైవ

మనే పేర్కొనుచున్నాడని దైవశక్తులనే వివరించుచున్నా డని మనము గ్రహింపవలసి యున్నది. అందువలన వేదస్వరూపమే విశిష్టమగును. క్రతుపర్యాయముగా, పౌరాణికముగా, బహుదేవతాకముగా శాయనాచార్యులు చెప్పినదెల్ల చెల్లనిదే యగును. గ్రహపర్యాయముగా, ప్రకృతిపర్యాయముగా పాశ్చాత్య పండితులు కల్పించినదెల్ల నొల్లబోవును. వేదము భగవద్వాక్యముగా ప్రమాణగ్రంథముగా ఉదాత్తమత ప్రతిపాదకముగా ప్రకాశమాన మగును.

ఈ మూల సిద్ధాంత మంగీకరించినచో దయానందుల వాదశేషమంతయు తప్పనిసరిగా నందుండి యేర్పడుచున్నది. ఋషులారాధించిన దేవతలు పరమార్థస్వరూపమైన వివిధగుణముల నిర్దేశించునేని, వేదగ్రంథమున దైవతత్త్వము, దైవమానుషసంబంధము, దైవోద్దిష్ట మానవధర్మము తప్పక నిరూపితములై యుండును. ఇట్టి ధర్మనిరూపణము వేదమందున్నదని దయానందుల సిద్ధాంతము. మానవునకు దైవమను గ్రహించిన ధర్మమే వేదోపదేశము. విశ్వమునకంతకు కర్తయు భర్తయునైన పరమేశ్వరునియొక్క శక్తులే వైదిక దైవతములన్నచో వేదమునందు సృష్టిసూత్రములు, భౌతికవిశేష

ములు నుండుట సహజము. ఈశ్వరుడు జగత్తును సృజించి పరిపాలించుచున్న విధము- భౌతికజ్ఞాన భాండారము-వేదమందు కలదనియే దయానందుల నిర్వచనము.

వేదమంత్రములందు నిహితమైయున్న నైతిక సారమును, పరతత్త్వమును పాశ్చాత్యపండితులు గాని, సాంప్రదాయానుయాయులు గాని పూర్తిగా తుడిచివైవ జాలరైరి. కాని యిరువాగులవారును ఆ సారమును అల్పాల్పముచేయ సాగిరి. అత్యుదాత్త మతాశయము లుద్ఘోషితమైన పట్టులందు, పాశ్చాత్యులు తమతమ ఛందో వ్యాకరణ ప్రమాణములనే కడకొత్తి పరిణామ వాదమున కనుగుణముగా అపార్థములు గావించిరి. అట్లుచేయనిచో, వేదర్షులకు ఆకాలముననే అద్భుతముగా నవీన విజ్ఞానమన్నదెల్ల తెలిసియే యున్నదని ఒప్పుకొనవలసి వచ్చును. అదెంతమాత్రము పాశ్చాత్యులకు గిట్టదు. మఱి శాయనాచార్యులవారు వైదిక ధర్మము నీతి నిర్వాహముగా సంతరింపక, ఐహిక ప్రయోజనార్థమైన యజ్ఞ యాగాది తంతు జాలముగా జెప్పివైచినారు. ఇట్లింత అపార్థీకరణపాత్రమైనను, వేదములు అందలి మహోన్నత భావ ప్రకాశముచేత, ఆరాధ్యములే యైనవి. ప్రకృతి పర్యాయముగనో, కర్త

పర్యాయముగనో సంక్షిప్తము కాలేదు. వేదము లందు దేవతలు ఋతస్వరూపులు, దురితాపహారులు, అఘ విమోచనులు, జ్ఞానమూర్తులుగా చెప్పబడి యున్నారు. పౌరుషము, శక్తి, ధర్మనిష్ఠ, సన్మార్గ దర్శనము— వీనిని గోరుచు నాయా దేవతలను ఋషులు సంస్తుతించి యున్నారు. హిబ్రూల బైబిలు, పార్సీల అవెస్తా గ్రంథములకు ఈడుగ అంతకన్న నెక్కుడుగా, వేదము ధర్మప్రతిపాదకమని దయానందులు దుందుభి మ్రోయించినారు.

సృష్టి విషయమును వేదములందు ముఖ్యమే మైయున్నది. లోకములు, తత్పాలనము, తన్నియమాదులు చెప్పబడి యున్నవి. దయానందులు అంతతో తనివిసనక నేటికాలపు భౌతిక జ్ఞానము (సైన్సు) సర్వము వేద మంత్రములం దున్నదని వాదించు చున్నారు. ఈ యంశమున మాత్రము భేదాభిప్రాయమున కవకాశ మున్నది. దీనింగూర్చి ఇదమిత్థమని నేను వచించుటకు సమర్థుడనుగాను. కాని ప్రాచీన యుగ విశేషములం గూర్చి ఆధునిక పరిశోధకుల కృషి ఫలితముగా నిటీవల మనకు తెలియవచ్చు విషయముల పోబడిం జూడగా, ప్రాచీనులకు భౌతికశాస్త్ర రహస్యములు తెలిసియే యుండినవని, వానిని మనము ఇక్కాలమున కొంతకొంత

పెంపు చేసినామని, ఇప్పటికిని విస్మృతమై మన కెఱుక వడక వారికి పరిచితమైన శాస్త్ర రహస్యము లుండిన వని తలంచుట కవకాశము గలదు. కావున వేదములందు మతసత్యమేగాక భౌతిక సత్యమును కలదని దయానందులు ప్రవచించుటలో వైపరీత్య మేమియు లేదు. ఇక్కాలము వారికి అందువడని కొండొక విజ్ఞానమునకు మూలసూత్రములు వేదప్రోక్తములై యున్నవని యే నావిశ్వాసము. అట్లగుచో అగాధమైన వేద విజ్ఞానముం గూర్చి దయానందుల ప్రవచన మిప్పట్టున పరిమితమే గాని విపరీతము కాదని చెప్ప నొప్పును.

దేవతల పేర్లకు అర్థము చెప్పుటలోగాని, వేద మంత్రములకు ఇతరత్ర అర్థవివరణ మందుగాని దయానందుల శబ్దార్థ సంశోధన విధానముంగూర్చి ప్రబలమైన ఆక్షేపములు చేయబడి యున్నవి. కాని ప్రాక్తనమైన వైదిక వాణి నవగాహనము చేసికొనుటలో మనము ఆధునిక భాషాపద్ధతుల ననుసరించుట వలన పొరవడు టయే గాని, దయానందులు పొరవడిరని చెప్పరాదు. మన మిప్పుడు వాడు పదములకు వ్యుత్పత్త్యర్థము విస్మృతమైనది. ఏ శబ్దమైనను మనము వాడినపుడు, అది నిర్దేశించు వస్తువు మన మనస్సునకు వచ్చుచున్న దే

గాని, మూలార్థము స్ఫురించుట లేదు. ఆ శబ్దమునకు బదులు మఱొక శబ్దమైనను అలవాటుచొప్పున వాడి నచో అదేవస్తువు నిర్దిష్టమగు చుండును. ఆ వస్తువును ఆ శబ్దమే యెందుకు నిర్దేశింప వలెనో యోచింపము. నాణెములకు ముద్ర వేసిన మూల్యము వలె, శబ్దములకు వాడుక చేసిన వస్త్వర్థమే గోచరమగు చున్నది. అందు వలన వాడుకలోని మన శబ్దములు సజీవములు గాక విస్మృత మూలార్థములై మృతప్రాయములై యున్నవి. ఆదికాలమున భాషాశబ్దము లిట్లుగాక, వ్యుత్పత్త్యర్థ స్ఫురణ మందఱకు గల్గియున్న కతన శబ్దము వాడినప్పుడెల్ల వివిధ గుణ నిర్దేశ స్ఫూర్తి తేటపడు చుండినది. ప్రతి శబ్దమునకు మూలార్థము మనస్సులో మెదలు చుండినది. 'వృకము' అనగానే తోడేలను జంతువు మాత్రము తోచుటగాదు. 'చీల్చునది' అను నర్థము స్ఫురించు చుండినది. మన కట్లుగాదు. ఆ జంతువును నిర్దేశించుటకు ఆ పదముగాక మఱొక పదమైనను వాడుకంబట్టి చాలును. అట్లే 'అగ్ని' అనగానే నిప్పును మనము తలచు కొందుము. వేఱే గుణముగాని వస్తువు గాని మనకు ద్యోతము కాదు. పూర్వులకు 'అగ్ని' శబ్దముచేత దాని వ్యుత్పత్తిని బట్టి అనేకార్థములు

స్ఫురించు చుండినవి. మన మాడు పదములు ఒకటి రెండు పరిమితార్థములు కల్గినవి. పూర్వుల శబ్దములు అనేకార్థ ద్యోతకములు. కావున వారు అగ్ని, వరుణుడు, వాయువు అని పేర్కొన్నపుడు, అన్యోన్య సంబంధ బాంధవ్యము గల బహు విధార్థ వస్తు సందోహము సూచిత మగును. బహు భావసమృద్ధమైన ఆలయము నకు ఒక్కొక్క శబ్దము వాకిలి తీయు సదుపాయము. మూలశబ్దస్ఫూర్తి చేత వేదర్షులకు భాషా విషయమున అతిశయమైన స్వాతంత్ర్య ముండినది. గా: చంద్ర శబ్దము లను వేదములందు ప్రయోగించిన విధ మరయదగును. నిరుక్తము వైదికశబ్దముల యీ అపార సారళ్యమును ఋజువు సేయుచున్నది. బ్రాహ్మణము లందును ఉపనిషత్తు లందును మూలార్థస్ఫురణతో శబ్దజాలము ప్రయుక్త మగుట లెస్సగా కన నగును.

బహు భాషావేత్తలగు పాశ్చాత్యపండితులకుగల సౌకర్యము దయానందులకు లేమి నిజమే. పాశ్చాత్య శబ్దశోధన వలన నిరుక్తములోని లోటుపాట్లను మనము సవరించుకొన వలసి యున్నది. పాశ్చాత్యుల సరణియు సమగ్రమన వలనుపడదు. కావున ప్రాచీన నవీన శబ్ద శాస్త్ర సాహాయ్యము సంతను వినియోగించియే,

మనము వేదార్థ నిర్వచనము చేయవలసి యున్నది. కాని యిదంతయు వేద భాష్యమున సూక్ష్మ సూక్ష్మ తరాంశములందు గణ్యమైనను, దయానందుల మూల సిద్ధాంతములకు బాధకము కాజాలదు. అల్పాంశములందు ఆయా పండితుల పరిశోధన లెట్లున్నను, భిన్నాభిప్రాయము లెన్ని యున్నను, బుద్ధి కతీతమైన దివ్యదృష్టి వలయు మూల సిద్ధాంత విషయమున దయానందుల వేదార్థము సమంజస మనుటకు వేద వాక్యములు, హేతువాదము, చారిత్రక విజ్ఞానము మనకు సహాయకములే యై యున్నవి. వేదము వివిధ నామములు గల యేకదైవమునే చాటుచున్నది. దైవిక ధర్మమును, తత్ సిద్ధికి మానుష యత్నమును ప్రవచించు చున్నది. సృష్టిధర్మమును మనకు తెలుపుచున్నది.

వేదము అపౌరుషేయ మను విషయమై వివరించుటకిట నవకాశము లేదు. ఇందు సైతము దయానందు లేమియు నసంబద్ధముగా చెప్పినవారు కారు. జగత్తు సర్గము చేసికొనగోరు వారు వస్తుత్రయము ముఖ్యముగా గుర్తింప వలెను – దైవము, ప్రకృతి, ఆత్మ. వేదము దైవమును మన కెఱుక పఱచుచున్నదని, ప్రకృతిధర్మమును నిర్దేశించుచున్నదని, ఆత్మకును

ప్రకృతి దైవములకు గల సంబంధము నిరూపించుచున్నదని దయానందులు విశ్వసించి, ఉద్ఘోషించి యున్నపుడు వేదము బ్రహ్మవాక్కు అని వారు ఉపదేశించుటలో విపరీతమేమియు గానరాదు. పై మూడు విషయములు సమగ్రముగా నిర్దుష్టముగ వేదము వ్యక్తపఱచు చున్న దని తలచు దయానందులకు అది ఏకైక ప్రమాణమే గదా యగును. ఎట్లు ఈ బ్రహ్మవాక్కు బహిర్గమించి నది, భాషయేమి, స్వరమేమి, ఇదెల్ల ఆర్యమత చరిత్రకు సంబంధించినది. మనజాతికి దైవమునకు గల చుట్టరిక మది. ఆధునిక విజ్ఞానులు ప్రకృతిధర్మమును అంగీక రించి, దైవమును కాదనువారై, దైవ వాక్కు అను వాదము భ్రాంతి యనుచున్నారు. కాని ఆ యాధునికు లను కడకొత్తు క్రొంగ్రొత్తలు వెను బ్రాకుటయుం గను చున్నాము. కావున నుహనీయు లెవరేని సిద్ధాంతము సేయునపుడు తాత్కాలిక వాదవాహిని కతీతులుగనే యుందురు. వారి ఆధిక్యతావిశేష మిది— అది అతీ తమును వీక్షించును. అత్యంతాంతరమును దర్శించును.

వేదార్థ ప్రవచనమందు చరమసిద్ధాంతము లేవైనను, దయానందులు మార్గదర్శి యనుట నిజము. వారి మార్గమున సత్య మెఱుకవడ గలదు. బహు శతా

ద్దులు భ్రమగప్పియున్న వేదముల సత్య స్వరూపమును వారిదృష్టి సమావలోకించినది. ప్రధాన వస్తువు నాకర్షించినది. దయానందులు జ్ఞాన కాసారములకు కప్పు తొలగించిన వారు. కాలవశమున మూతవడిన ఆలయములకు వాకిలి తీసిన వారు. *

* 'వేదిక్ మాగజీన్' ౧౯౧౬.

# రమేశచంద్రదత్తు

రమేశచంద్రదత్తు దివంగతుడైనాడు. ఆ సమృద్ధజీవితము సమాప్తి చెందినది. బహుముఖముగా నిరంతరము కృషి సల్పినవాడు. కీర్తి గౌరవము లార్జించినాడు. బ్రిటిషు దేశమునందును, భారత దేశమునందును అతని పేరు వన్నెవాసి గాంచినది. అదృష్టదేవత అతనికి నిత్యప్రసన్న. వెనుబాటు నెఱుగడు. అభివృద్ధి పరంపర లతనివి. వచ్చినపదవిని ప్రశస్తిని కృషిచేతను నేర్పు చేతను సార్థక పఱచుకొనువాడు. ఆ గణ మంతరించుచున్నది. ఆతరముపెద్దలు ఈనాటి పిన్నవారి మనస్సునకు వచ్చుటలేదు. రమేశుడు ఉచ్చదశలో అస్తమించినాడు. తానాక్రమించిన క్రొత్తపదవియందు తన తెలివితేటలింకను భాసింపకమున్నే అరిగినాడు. నవయుగావతార సమయముననే చన్నవాడుగాన ఈకాలమువారి నిశితవిమర్శ లాతని పైకొనలేదు. కళంకము లాపాదించలేదు.

ఆతరమువారైన మహాపురుషు లొకరొకరు చెల్లుకొనుచున్నారు. వారలస్థానమున నితరులు పైకి వచ్చుటలేదు. ఇంకను నిలిచియున్న యే పదిమందియు గడచిన శతాబ్దమునకు స్మృతిచిహ్నములుగా నున్నారే గాని వర్తమానమునకు కర్తలుగాక యున్నారు. నవ్యాదర్శములు, నూతనసమస్యలు మొలకెత్తినవి. ఆ నిర్వాహము క్రొత్తవారిపైఁ బడుచున్నది. ఈ జాతియే వేఱుగానున్నది. వీరితత్త్వము, సంకల్పము, మనశ్శక్తి, ఉత్సాహము — యివన్నియు వేఱుగానున్నవి. కార్యరంగమున జొఱబడుటకు వాకిట చేరియున్నారు. వీరికిని తొంటి తరమునకును సాపత్న్యము లేదు.

పోయినతరమునందు శ్రేష్ఠులుగా గణనీయులైన వారిరకమే వేఱు. అధికారి, కాంగ్రెసువాది, సాహిత్యవేది, ప్రాచ్యవిజ్ఞానశోధి, ఆంగ్ల వచనరచన నైపుణ్యశాలి, వృత్తిజయశీలి యగు వారు మార్గదర్శకులైరి. వేషభాషలందు, జీవితపద్ధతులందు వారిని తక్కు జనమనుసరించు చుండినది. అట్లుగదా పైకిరావలెను అని తలంచు చుండినది. ఆత్మప్రత్యయముతో వాగ్విన్యాసముతో ఆ నాయకగణము వ్యవహరించినది. వారి తెలివితేటలు విదేశీయ వ్యామోహముచేత అనుకరణమను

పంజరమున నిమిడిపోయినవి. వారి సభ్యతకు ఔన్న త్యము వైశాల్యము గాంభీర్యము కొఱవడినవని వారె ఱుంగరు. ఆగణమునకు నాయకమణియైనవాడు రమేశ చంద్రుడు. అతనికున్న యుత్సాహము శక్తి సర్వతో ముఖత, ఆత్మప్రత్యయము, అదృష్టము, అధికారసిద్ధి ఆతరమున మఱెవ్వరికిని చేకూరలేదు – శక్తిసామర్థ్య ములను ప్రకృతి లెస్సగా అతని కనుగ్రహించినది. అదృష్టదేవత అత్యంత మతని నభిమానించినది. దివ్య మైన విగ్రహము, మంచి దృఢకాయము కలవాడగుటచే నవిరామముగా పరిశ్రమింప గల్గినాడు. మనస్తత్త్వము ఉత్సాహవంతము శక్తిమంతము నిరామయము నై సంకల్పసిద్ధిని నిష్కర్ష చేసికొన్నది. ఐహిక భోగభాగ్య ముల ననువుగా ననుభవించుకొను స్వాభిమానము సమగ్రముగా నుండినది. నేర్పు మెలకువ కలిమివలన అనవసరమైన సంఘర్షణల కవకాశము దూరమైనది. నిరంతరాయముగా జీవితకృషి సాగినది. చదివినదెల్లను విన్నదెల్లను తనసొమ్ము గావించుకొనగల గ్రాహకశక్తి అమరి యుండినది. గాంభీర్య నైశిత్యములు కొఱవడి నను లాఘవమున్న కతన బాధ లేకపోయినది. ఉన్న సామగ్రిని మిక్కిలి ప్రయోజనకారిగా నుపయోగించు

కొను బుద్ధికుశలతయే ఉపజ్ఞకు మాఱుగా నతని కుపక రించినది. నిజమైన సారస్వతప్రతిభగాని గొప్ప మేధావి తనముగాని లేకపోయినను, ఆలోపమును కప్పిపుచ్చి జనరంజనము సేయగల వాగ్ధోరణి, రచనానైపుణి అతనియందు భాసించినవి. ఏ భావమునకు ఏ మాటకు తడవుకొనక నక్కుఱలేక యేకవాహినిగా నడచు నాతని యుపన్యాసములును, రచనాదికములును గౌరవ పాత్రములైనవి. ఈ గుణవిశేషము లాతనికి ప్రకృతి సిద్ధములైనవి. అదృష్టవశమున నాతడు పేరుప్రతిష్ఠలుగల సంపన్నకుటుంబమున జన్మించినాడు. విద్యావకాశము లనుత్తమముగా లభించినవి. ఆంగ్లదేశమునకు పోవుట సివిల్ సర్వీసునందు ప్రవేశముదొరకుట, ఉద్యోగాభివృద్ధి నిరంతరాయముగా సాగినవి. అక్కాలమున నీదేశస్థు నకు అంతకుమించిన అవకాశములేదు. ఆంగ్లపాలనా పద్ధతి నత్యంత మనుకరించిన స్వదేశసంస్థానమున దివాంజీపదవియందు చివర కతని జీవిత మవధి గాంచినది.

ప్రకృతిసిద్ధమైన గుణసమృద్ధికిని పరిమితియున్నది. అప్పటి బంగాళీ మహాపురుషు లందరిలో ఉపజ్ఞయందు రమేశచంద్రుడు కొండికయనియే చెప్పవలెను. పాలన

సామర్థ్యమున నతడు మొదటిరకముగాదు. రెండవ శ్రేణియే. కాంగ్రెసు రాజకీయములందతడు కొంత కాలము ముందువరుసలో నుండినను, రెనడే, సురేంద్రనాథ్ వంటివాడు కాడు. రెనడేగారికున్న రాజకీయ సమాలోచనగాని కార్యనిర్వాహముగాని అతనికిలేదు. సురేంద్రుని వాగ్వైభవమును లేదు. సారస్వతమున నతనిప్రజ్ఞ అనుకరణమాత్రము. స్వతంత్రప్రతిభ లేదు. విద్వద్విషయములంగూర్చి సరళముగా వ్రాయగలడు. అనువాదములు సులభములు; రమణీయములు. కాని సంస్కృతమున పాండిత్యము తక్కువ. ఆర్థిక విషయము లందు రెనడేతోగాని, గోఖలేతోగాని సాటిరాడు. అట్లయ్యును రాజకీయముగా మిక్కిలి ఉపకరించిన ఆర్థికశాస్త్ర రచన లీదేశమున నింతదనుక నతనివనియే గుర్తింపవలెను. అతని రచనల విస్తృతి చూచినను నైపుణ్యముచూచినను అతని ప్రతిభకు పాండితికి మించి యున్నవి. అందువలన, బంగాళీలో అతడు రచించిన చారిత్రిక నవలలు మినహా, తక్కిన యతని గ్రంథరాశి చిరస్థాయి కాజాలదు. బహుశః అతని నవలలు నిలువ వచ్చును. అతనిప్రజ్ఞ కవి పరమావధి. ఋగ్వేదము నత డాంగ్లమున అనువదించినాడు. సౌలభ్యము, సార

ళ్యముచే నప్పుత్పన్నులు తనిసినను, వేదలక్షణము లందులేవు. ప్రాచీనభారత నాగరికతంగూర్చిన యతని గ్రంథము చక్కని సంపుటీకరణమేగాని స్వతంత్ర పరిశోధనముగాదు. మఱి అతని సామర్థ్యము మిక్కిలి రాణించినది తాత్కాలిక రచనలందు. పత్రికాలేఖనమునకు ఖండరచనలకు అతడు అఖండుడు. పత్రికాలేఖరికి ఉపజ్ఞ, వ్యుత్పత్తి నైశిత్యము అవసరములేదు. అవి ప్రతిబంధకములు గూడ. ఉన్నసామగ్రిలో ఆకర్షించుదాని నేఱుకొని చక్కగా, స్పష్టముగా, సుబోధ్యముగా వ్రాయుటయే పత్రికాలేఖరి ధర్మము. ఇక దీనికి జవాబు లేదన్నట్లుగా గట్టిగా నొకవాదము బలపఱచు నేర్పు వ్రాతయే పత్రఖండ (Pamphlet) రచనమున మేలుబంతి. ఈ లక్షణములు రమేశదత్తున నున్నట్లు మన కాలములో మఱెవ్వరికి నుండి యుండలేదు. కర్జను ప్రభువునకు అతడు వ్రాసినలేఖ, 'భరతదేశపు ఆర్థికచరిత్ర' అనునవి అతని అత్యుత్తమ రచనలు. 'కర్జను లేఖ' చదివినవారందఱు, మఱి ఆ ప్రభువు జవాబేమని విచారించినవారే కాదు. దత్తుగారిది కడమాటగానే భావించిరి. తిరుగులేని రచనమది. అతని 'ఆర్థికచరిత్ర' వలన బ్రిటిషు దేశము ఆర్థికముగా భరతదేశమునకు చేసిన

అపచారము, ద్రోహము సర్వజనవేద్య మైనది. అందు వలననే బహిష్కారోద్యమమునకు మంచి అవకాశ మేర్పడినది. ఆ గ్రంథమే లేకుండినచో ప్రజాహృదయము ఆ యుద్యమమునకు పక్వమై యుండెడిదిగాదు. దత్తు చరిత్ర వ్రాసినవాడేగాక చరిత్రను సృష్టించిన వాడైనాడు. ఇట్లయ్యును రమేశుని రచనలు, నవలలు మినహా, తక్కిన వేవియు సాహిత్యములో చేరవు. కాని ఎన్నిలోపము లున్నను, అతడు వ్రాసిన దేదిగూడ లోకమున కుపకరించిన దనియే చెప్పవలయును. రామాయణ మహాభారతముల కతడు చేసిన ఆంగ్లానువాదము నిస్సారపు కవనమేయైనను, ఇంగ్లాండులోని ప్రజకు ఆ యితిహాసగాథలను పరిచయము చేసినవి. అందువలన తరువాతి వారు ప్రాచ్యవిజ్ఞానమును పశ్చిమ వాసులకు తెలియ బఱచుటకు మార్గము ననువు పఱచినవి. రమేశ దత్తునిగూర్చి మనమింతవఱకు గట్టిగా చెప్పవచ్చును. అతడు పురోగామిగా మహాకృషి చేసినవాడు. దాని ప్రయోజనమంతయు భవిష్యత్తునకు దక్కగలదు.

రమేశునివంటివారు తదధికులైన సమకాలికుల కన్నను విశేషముగా చెల్లుబడి యైనవారు. అట్టి గణము నకు మేలుబంతి గావుననే రమేశునిగూర్చి యింత

వ్రాయుట. వారు చేసిన కృషి పరిసమాప్తి నొందినది. వారి కమరియుండిన గుణములతో మన యిప్పటి ప్రయోజనములు నెఱవేఱవు. అంతకన్నను ఘనమును సూక్ష్మమునైన విద్య, విస్తృతమైన ధీ వ్యాపారము, అపరిమితమైన జ్ఞానతృష్ణ, నిరవధికమైన కార్యపరత, అమితమైన ధైర్యము త్యాగము, శక్తి సాహసము, దుస్సాధ్యములైన ఆదర్శముల నుపలబ్ధమొనర్చుకొనగల్గు ఆత్మగుణవిశేషము లన్నియు భరతపుత్త్రిలకీ సమయమున నవసరములై యున్నవి. అవిలేనిదే మన దేశమునకు ముక్తి గలుగదు. కాని రమేశదత్తున కుండిన గుణగణమును లఘువుపఱచరాదు. వారి తరమునకును మన యీ పునర్వికాసమునకు మధ్యాతరము వారు నిస్సారులై, నిరుత్సాహులై, సంకల్పశూన్యులై యుండినారు. రమేశుని నిరంతరకృషి, అపరిమితోత్సాహము, సమ్మోద చైతన్యముం గాంచి అట్టివారెల్లరు తలవ్రాల్పవలసినదే. రమేశుని కార్యపరత ఎల్లరకును గుణపాఠమే. *

* 'కర్మయోగి' ౪-౧౨-౧౯౦౯.